# ప్రార్థనాపంచకము

1. యతీశ్వర శ్రుణు శ్రీమన్ కృపయా పరయా తవ ।
మమ విజ్ఞాపన మిదం విలోక్య వరదం గురుమ్ ॥

శ్రీమన్ = ఉభయవిభూతులను నిత్యంగా కల్గిన, యతీశ్వర! = యతులకు ఈశ్వరులైన శ్రీరామానుజా!, వరదం గురుమ్ = వరదులనే ఆచార్యులను, విలోక్య = కటాక్షించి, తవ పరయా కృపయా = మీకే అసాధారణం అయిన గొప్ప కృపతో, మమ = నాయొక్క, ఇదం విజ్ఞాపనమ్ = ఈ విన్నపాన్ని, శ్రుణు = ఆలకించు.

2. అనాదిపాపరచితా మంతఃకరణనిష్ఠితామ్ ।
యతీంద్ర విషయే సాంద్రాం వినిర్వాసయ వాసనామ్ ॥

యతీంద్ర = యతిరాజా !, అనాదిపాపరచితాం = మొదలు తెలియని, చిరకాలంగా చేస్తున్న పాపాలచేత సంభవించినది, అంతఃకరణనిష్ఠితాం = అంతరింద్రియం అనే మనస్సులో స్థిరంగా ఉండేది, విషయే = స్వరూపానికి తగని బాహ్యావిషయాలలోగల, సాంద్రాం = దట్టమైన, వాసనాం = సంగాన్ని, వినివర్తయ = తొలగించాలి.

3. అపి ప్రార్థయమానానాం పుత్రక్షేత్రాదిసంపదామ్ ।
కురు వైరాగ్య మేవాత్ర హితకారిన్ యతీంద్ర నః ॥

హితకారిన్ = హితాన్ని చేసే, యతీంద్ర = యతీశ్వరా!, పుత్రక్షేత్రాది సంపదామ్ = పుత్రసంతానం, భూమి మొదలైన లౌకికసంపదను, ప్రార్థయ మానానామ్ అపి = మీవద్ద దాసులమైన మేము ప్రార్థించినవారమైనా, నః= = మాకు, అత్ర = ఈ పుత్రక్షేత్రాదుల విషయంలో, వైరాగ్య మేవ = విరక్తినే, కురు = కలుగజేయాలి.

4. యథాపరాధాః న స్యు ర్మే భక్తేషు భగవత్యపి ।
తథా లక్ష్మణయోగీంద్ర యావద్దేహం ప్రవర్తయ ॥

లక్ష్మణయోగీంద్ర =శ్రీరామానుజయోగీంద్రా!, మే = (మీ) దాసుడనైన నాకు, భక్తేషు = భాగవతులపట్ల, భగవతి+ అపి = భగవానునిపట్లను, అపరాధాః = అపచారాలు, యథా న స్యుః తథా = కలగని రీతిలో, యావద్దేహం = దేహం ఉన్నంతకాలం, ప్రవర్తయ = నన్ను నడిపించాలి.



5. ఆమోక్షం లక్ష్మణార్య త్వత్ప్రబంధపరిశీలనైః ।
కాలక్షేపోஉస్తు న స్సద్భి స్సహవాస ముపేయుషామ్ ॥

లక్ష్మణార్య = శ్రీరామానుజార్యా !, ఆమోక్షం =మోక్షాన్ని పొందేంతవరకు, నః = దాసులమైన మాకు, సద్భిః = సత్పురుషులతో, సహవాసం = కలసి నివసించడాన్ని, ఉపేయుషాం (సతాం) = పొందినవారమై, త్వత్ ప్రబంధ పరిశీలనైః = తాము అనుగ్రహించిన సద్గ్రంథాలను పరిశీలనచేయడం ద్వారా, కాలక్షేపః = పొద్దును సరి అయిన రీతిలో నడపడం, అస్తు = కలుగుగాక.

6. పరాంకుశమునీంద్రాది పరమాచార్యసూక్తయః ।
స్వదంతాం మమ జిహ్వాయై స్వత ఏవ యతీశ్వర ॥

యతీశ్వర = యతిరాజా !, పరాంకుశ = పరాంకుశులనబడే, మునీంద్ర = మునిశ్రేష్ఠులైన నమ్మాళ్వార్లు, ఆది= మొదలైన, పరమాచార్య = పరమాచార్యుల, సూక్తయః = "శెవిక్కినియ శొఞ్జొల్" అనదగిన శ్రీసూక్తులు, స్వతః ఏవ = సహజంగానే, (తమకు తామే), మమ జిహ్వాయై = దాసుని జిహ్వకు, స్వదంతామ్ = రుచించుగాక !

7. ఇత్యేతత్ సాదరం విద్వాన్ ప్రార్థనాపంచకం పఠన్ ।
ప్రాప్నుయాత్ పరమాం భక్తిం యతిరాజపదాబ్జయోః ॥

ఇతి = పూర్వోక్తప్రకారంగా, ఏతత్ = ఈ, ప్రార్థనాపంచకం = అయిదు ప్రార్థనలను వ్యక్తం చేసే స్తోత్రాన్ని, సాదరం = ప్రేమతో, పఠన్ = అనుసంధిస్తూ, విద్వాన్ = జ్ఞానం కలవాడు, యతిరాజపద+అబ్జయోః= భగవద్రామానుజుల శ్రీచరణారవిందాలలో, పరమాం భక్తిం = మిక్కిలి గొప్ప భక్తిని, ప్రాప్నుయాత్ = పొందగలడు.

8. కాషాయశోభి కమనీయశిఖానివేశం
దండత్రయోజ్జ్వలకరం విమలోపవీతమ్ ।
ఉద్యద్దినేశనిభ ముల్లసదూర్ధ్వపుండ్రం
రూపం తవాస్తు యతిరాజ దృశో ర్మమాగ్రే ॥

యతిరాజ = యతిసార్వభౌమా !, కాషాయశోభి = కాషాయంతో ప్రకాశించేది, కమనీయశిఖానివేశం = అందమైన శిఖాసన్నివేశాన్ని కల్గినది,

దండత్రయ+ఉజ్జ్వలకరమ్ = త్రిదండంలో మిక్కిలిగా వెలిగే శ్రీహస్తాన్ని కల్గినది, విమల+ ఉపవీతం = తెల్లని యజ్ఞోపవీతాన్ని కల్గినది, ఉల్లసత్ ఊర్ధ్వపుండ్రం = ప్రకాశించే ఊర్ధ్వపుండ్రాలను కల్గినది, ఉద్యత్ దిన+ ఈశనిభం = ఉదయించే సూర్యునివంటిది అయిన, తవ రూపం = నీ రూపం, మమ దృశోః = దర్శించాలని ఆశపడే నా రెండు కన్నులయొక్క, అగ్రే = ఎదురుగా, అస్తు = ఉండుగాక !



# శ్రీగోదా చతుఃశ్లోకి - తాత్పర్యంతో

**1) నిత్యా భూషా నిగమశిరసాం నిస్సమోత్తుంగవార్తా**
**కాంతో యస్యాః కచవిలులితైః కాముకో మాల్యరత్నైః ।**
**సూక్త్యా యస్యాః శ్రుతిసుభగయా సుప్రభాతా ధరిత్రీ**
**సైషా దేవీ సకలజననీ సించతాం మామపాంగైః ॥**

ఏ గోదాదేవి పల్కిన సాటి లేని గొప్ప సూక్తి (తిరుప్పావై) వేదాంతాలకు నిత్యమైన భూషణమో (వేదాంతార్థాలకు శోభను కల్గించిందో), ఏ గోదాదేవి తన కేశాలలో ముడుచుకొని తీసి ఇచ్చిన గొప్ప పూమాలికలచేత భగవానుడు ఆకర్షింపబడి ఆమెపట్ల అనురాగాన్ని కలవాడయ్యాడో, చెవులకు ఇంపైన ఎవరి సూక్తిచేత (తిరుప్పావై ప్రబంధంచేత) ధరిత్రి ప్రబోధాన్ని పొందుతున్నదో, అటువంటి, సకలలోక జనని అయిన ఈ గోదాదేవి నన్ను తన కటాక్షంతో తడుపుగాక (అనుగ్రహించుగాక).

**2) మాతా చేత్ తులసీ పితా యది తవ శ్రీవిష్ణుచిత్తో మహాన్**
**భ్రాతా చేత్ యతిశేఖరః ప్రియతమః శ్రీరంగధామా యది ।**
**జ్ఞాతార స్తనయా త్వదుక్తిసరసస్తన్యేన సంవర్ధితాః**
**గోదాదేవి! కథం త్వమన్యసులభా సాధారణా శ్రీరసి ॥**

గోదాదేవీ! నీ తల్లి తులసి. తండ్రి మహానుభావుడైన విష్ణుచిత్తుడు. నీ సోదరుడు యతిరాజు. నీ ప్రియతముడు (భర్త) శ్రీరంగనాథుడు. నీ పుత్రులు నీ సరసమైన సూక్తి అనే పాలతో వర్ధిల్లిన జ్ఞానులు. అందువల్ల నీవు అనన్య సులభవు, అసాధారణ వనితవు (చాలా గొప్పదానవు).

**3) కల్పాదౌ హరిణా స్వయం జనహితం దృష్టేన సర్వాత్మనా**
**ప్రోక్తం స్వస్య చ కీర్తనం ప్రపదనం స్వస్మై ప్రసూనార్పణమ్।**
**సర్వేషాం ప్రకటం విధాతు మనిశం శ్రీధన్వినవ్యే పురే**
**జాతాం వైదిక విష్ణుచిత్తతనయాం గోదా ముదారాం స్తుమః ॥**

కల్పారంభంలో, సకలలోకాలకు ఆత్మ అయిన హరి లోకహితాన్ని కోరి స్వయంగా తన కీర్తనను, శరణాగతిని, తనకు పూవులను అర్పించడం మొదలైన

ఉజ్జీవనగతులను ఉపదేశించాడు. వాటిని అన్నిటిని నిత్యం అనుష్ఠించి వ్యక్తం చేయడంకోసం శ్రీవిల్లిపుత్తూరులో వైదికులైన విష్ణుచిత్తుల పుత్రికగా ఆవిర్భవించిన, ఉదారస్వభావాన్ని కల గోదాదేవిని స్తుతిస్తున్నాను.

**4) ఆకూతస్య పరిష్క్రియా మనుపమా మాసేచనం చక్షుషో**
**ఆనందస్య పరంపరా మనుగుణా మారామశైలేశితుః ।**
**తద్దోర్మధ్యకిరీటకోటిఘటిత స్వోచ్ఛిష్టకస్తూరికా**
**మాల్యామోదసమేధితాత్మవిభవాం గోదా ముదారాం స్తుమః ॥**

గోదాదేవి, వనగిరినాథుడైన సుందరబాహు స్వామియొక్క అభీష్టానికి పరిష్కారం, ఆ స్వామినేత్రాలకు సాటిలేని తృప్తిని కల్గిస్తున్నది. ఆ స్వామి వక్షః స్థలం, కిరీటం అగ్రభాగం ఆమె ముడుచుకొని తీసి ఇచ్చిన కస్తూరికామాలికతో అలంకరింపబడ్డాయి. ఆ మాలిక ఆమోదంతో (**"సర్వగంధః"** అని అన్ని సుగంధాలను కలవాడుగా, **"ఏష హ్యేవానందయాతి"** అని అందరిని ఆనందింపజేసే వాడుగా చెప్పబడే భగవానునకు అపూర్వమైన సుగంధాన్ని, ఆనందాన్ని కల్గించడం ద్వారా) గోదాదేవి వైభవం మిక్కిలిగా వృద్ధిచెంది ప్రకాశిస్తున్నది. ఇటువంటి మహనీయురాలైన గోదాదేవిని స్తుతిస్తున్నాము.

**స్వోచ్ఛిష్టమాలికాబంధ గంధబంధురజిష్ణవే ।**
**విష్ణుచిత్తతనూజాయై గోదాయై నిత్యమంగళమ్ ॥**





# శ్రీరామానుజ చతుఃశ్లోకి – వివరణంతో

శ్రీరంగం, తిరుమల, పెరుమాళ్ కోయిల్ (కంచి), తిరునారాయణపురం (మేల్కోటె) – అనే నాల్గు దివ్య దేశాలలోను భగవద్రామానుజుల విజయానికి మంగళాన్ని ఆశాసిస్తున్నాయి – ఈ నాల్గు శ్లోకాలు.

**1) అనిశం భజతామనన్యభుజాం చరణాంభోరుహ మాదరేణ పుంసామ్ ।**
**వితరన్ నియతం విభూతిమిష్టాం జయ రామానుజ! రంగధామ్ని నిత్యమ్ ॥**

భగవద్రామానుజా! మీ చరణారవిందాలను ఎల్లప్పుడు ఆశ్రయించి ఉండే అనన్యగతికులైన దాసులకు ఏ విభూతి అభీష్టమో, ఆ విభూతిని నియతంగా అనుగ్రహిస్తూ, శ్రీరంగంలో మీరు నిత్యం విజయాన్ని పొందాలి.

**2) భువినో విమతాన్ త్వదీయసూక్తిః కులిశీభూయ కుదృష్టిభిస్సమేతాన్ ।**
**శకలీకురుతే విపశ్చితీడ్యా జయ రామానుజ! శేషశైలశృంగే ॥**

భగవద్రామానుజా! విద్వాంసులు పొగడతగిన మీ శ్రీసూక్తి వజ్రాయుధంవంటిది. అది భూమిలో ఉండే కుదృష్టులతోపాటు ప్రతివాదులను అందఱిని చూర్ణం చేస్తున్నది. (ఇటువంటి గొప్పతనాన్ని కల శ్రీసూక్తులను అనుగ్రహించిన) మీరు వేంకటాద్రిశిఖరంపై నిత్యశ్రీః నిత్యమంగళంగా వర్ధిల్లాలి.

**3) శ్రుతిషు స్మృతిషు ప్రమాణతత్త్వం కృపయాఽఽలోచ్య విశుద్ధయా హి బుద్ధ్యా।**
**అకృథాః స్వత ఏవ భాష్యరత్నం జయ రామానుజ! హస్తిధామ్ని నిత్యమ్ ॥**

భగవద్రామానుజా! నిర్హేతుకకృపతో శ్రుతిస్మృతులలోని ప్రమాణాల యథార్థాన్ని గ్రహించి, విశుద్ధమైన బుద్ధితో చాలా గొప్పదైన శ్రీభాష్యాన్ని అనుగ్రహించారు. ఇటువంటి మీరు శ్రీహస్తిగిరిలో నిత్యంగా వర్ధిల్లాలి.

**4) జయ మాయిమతాంధకారభానో! జయ బాహ్యప్రముఖాటవీకృశానో! ।**
**జయ సంశ్రితసింధుశీతభానో! జయ రామానుజ! యాదవాద్రిశృంగే ॥**

మాయావాదుల మతాలు అనే చీకటికి సూర్యునివంటివాడా! వేదబాహ్యులు మొదలైనవారు అనే అడవికి కార్చిచ్చువంటివాడా! భక్తులనే సముద్రాన్ని ఉప్పొంగించే చంద్రునివంటివాడా! శ్రీరామానుజా! మీరు యాదవాద్రిలో నిత్యం వర్ధిల్లాలి.

**5) రామానుజచతుఃశ్లోకీం యః పఠేన్నియతస్సదా ।**
**ప్రాప్నుయాత్ పరమాం భక్తిం యతిరాజపదాబ్జయోః ॥**

భక్తులకు నిత్యానుసంధేయంగా నియమింపబడ్డ ఈ రామానుజ చతుఃశ్లోకిని నియమంతో నిత్యానుసంధానం చేసేవారు భగవద్రామానుజుల శ్రీచరణపద్మాలలో గొప్ప భక్తిని ప్రత్యక్షఫలంగా పొందుతారు.



# శ్రీషోడశాయుధస్తోత్రము

1. స్వసంకల్పకలాకల్పై రాయుధై రాయుధేశ్వరః ।
జుష్టః షోడశభిర్దివ్యై జుషతాం వః (నః) పరః పుమాన్ ॥

తన సంకల్పజ్ఞానముయొక్క పదునాఱవ భాగములా ! అనునట్లున్న పదునాఱు ఆయుధములతో కూడినవాడును, శ్రీసుదర్శనమూర్తి రూపములోనున్న పరమపురుషుడు మిమ్ములను (మనలను) ఆనందపఱచును గాక !

2. యదాయత్తం జగచ్చక్రం కాలచక్రం చ శాశ్వతమ్ ।
పాతు వ (న) స్తత్ పరం చక్రం చక్రరూపస్య చక్రిణః ॥

జననమరణములతో చక్రమువలె పరిభ్రమించు లోకము, అట్టి పరిభ్రమణ స్వభావమునే కల్గిన శాశ్వతమైన కాలమును ఏ సుదర్శన చక్రము యొక్క అధీనమున నున్నవో, అట్టి గొప్పదైన, భగవానుని ఆయుధమగు చక్రరాజము మిమ్ములను (మనలను) కాపాడుగాక !

3. యత్ప్రసూతిశతై రాసన్ రుద్రాః పరశులాంఛనాః ।
స దివ్యో హేతిరాజస్య పరశుః పరిపాతు వః (నః) ॥

శ్రీసుదర్శనమును ప్రార్థించి, పరశువు అను ఆయుధమును వరముగా పొంది, అందువలన ఖండపరశువు అను ప్రసిద్ధిని పొంది, సంహారాధికారులగు రుద్రులు ఏ పరశువువలన జనించిన వారయ్యిరో, అట్టి పరశువు అను ఆయుధము మిమ్ములను (మనలను) రక్షించునుగాక !

4. హేలయా హేతిరాజేన యస్మిన్ దైత్యాః సముద్ధృతే ।
శకుంతా ఇవ ధావంతి స కుంతః పాలయేతవః ॥

ఆయుధ ప్రభువైన శ్రీసుదర్శన భగవానుడు ఈటె అనే ఆయుధమును విలాసంగా చేతితో ఎత్తగానే దానిని చూచి అసురులు భయముతో పక్షులవలే పరుగు తీయుదురు. అట్టి కుంతమనే ఆయుధము మనలను కాపాడుగాక!

5. దైత్యదానవముఖ్యానాం దండ్యానాం యేన దండనమ్ ।
హేతిదండేశదండోఽసౌ భవతాం (వస్మాకం) దండయేత్ ద్విషః ॥

దండింపదగిన దైత్యులు, దానవులు మొదలగువారిని ఏ దండాయుధముతో భగవానుడు దండించునో, అట్టి శ్రీసుదర్శనుని దండాయుధము మీ (మన) శత్రువులను దండించును గాక !

**6. అనన్యాయభక్తానాం రుంధన్నాశామతంగజాన్ ।**
**అనంకుశవిహారో వః (నః) పాతు హేతీశ్వరాంకుశః ॥**

తనను తప్ప వేఱొకరిని ఆశ్రయింపని భక్తులయొక్క లౌకికములైన ఆశలు అను మదగజములను నిరోధించునది, ఎట్టి అడ్డు లేని విహారమును కల్గినదగు శ్రీసుదర్శనప్రభువుయొక్క అంకుశమను ఆయుధము మిమ్ములను (మనలను) కాపాడుగాక !

**7. సంభూయ శలభాయంతే యత్ర పాపాని దేహినామ్ ।**
**స పాతు శతవక్త్రాగ్నిహేతిః హేతీశ్వరస్య వః (నః) ॥**

సంసారుల పాపసమూహములు అన్నియు కలసి ఏ (శతముఖాగ్ని అను) ఆయుధమునందు, అగ్నిలో మిడతలవలె, నిశ్శేషముగా దహింపబడుచున్నవో అట్టి శ్రీసుదర్శన భగవానునియొక్క శతముఖాగ్ని అను ఆయుధము మిమ్ములను (మనలను) కాపాడుగాక !

**8. అవిద్యాం స్వప్రకాశేన విద్యారూప శ్ఛినత్తి యః ।**
**స సుదర్శననిస్త్రింశః సౌతు వః (నః) తత్త్వదర్శనమ్ ॥**

విద్యారూపమగు ఏ ఖడ్గము ప్రకృతిసంబంధమూలకమైన అజ్ఞానమును ఛేదించునో, అట్టి శ్రీసుదర్శనదేవుని ఖడ్గము మీకు (మనకు) పరతత్త్వదర్శనమును కల్గించును గాక !

**9. క్రియాశక్తిగుణో విష్ణోః యో భవత్యతిశక్తిమాన్ ।**
**అంకుశశక్తి స్సా శక్తి రశక్తిం వారయేత వః (నః) ॥**

భగవానుని జగత్కర్తృత్వమను గుణము ఏ శక్తి అను ఆయుధముయొక్క రూపమో, మొక్కవోని సామర్థ్యమును కల ఆ శక్తి మీ (మనయొక్క) అశక్తిని పోగొట్టును గాక. అనగా- మన జ్ఞానానుష్ఠానములయందు కల్గు ఆశక్తిని తొలగించునుగాక- అని తాత్పర్యము.



**10. తారత్వం యస్య సంస్థానే శబ్దే చ పరిదృశ్యతే ।**
**ప్రభోః ప్రహరణేంద్రస్య పాంచజన్య స్స పాతు వః (నః) ॥**

భగవానుని శంఖమగు పాంచజన్యము రూపమున, స్వరమున తారత్వమును (ఔన్నత్యమును, ప్రణవరూపమును) కల్గియున్నది. అట్టి పాంచజన్యము మిమ్ములను, (మనలను) రక్షించునుగాక !

ఇంతవరకు దేశికులు శ్రీసుదర్శనభగవానుని కుడి వైపునగల ఎనిమిది భుజములలోని ఎనిమిది ఆయుధములను స్తుతించి, పిమ్మట, ఎడమ వైపున గల ఎనిమిది భుజములలోని ఆయుధములను స్తుతింపనెంచి, మొదటగా పాంచజన్యమును ఇందు ప్రస్తుతించుచున్నారు. ఈ పాంచజన్యమును **“తెళి పణిలమ్”** అనుచు పాశురమున ప్రస్తుతించిరి.

**11. యం సాత్త్విక మహంకార మామనంత్యక్షసాయకమ్ ।**
**అవ్యా ద్వ (న్న) శ్చక్రరూపస్య తద్ధనుః శార్ఙ్గధన్వనః ॥**

ఇంద్రియములు అను బాణములను కల్గిన ఏ శార్ఙ్గమను వింటిని పరాశరమహర్షి మొదలగు తత్త్వవిదులు పంచేంద్రియములకు మూలకమగు సాత్త్వికహంకారముయొక్క తత్త్వముగా పల్కిరో, అట్టి శ్రీసుదర్శనభగవానుని విల్లు అగు శార్ఙ్గము మిమ్ములను (మనలను) కాపాడును గాక !

**12. ఆయుధేంద్రేణ యేనైవ విశ్వసర్గో విరచ్యతే ।**
**స వః (నః) సౌదర్శనః కుర్యాత్ పాశః పాశవిమోచనమ్ ॥**

పాశమను ఏ ఆయుధముద్వారా భగవానుడు జగత్సృష్టిని చేయునో, అట్టి శ్రీసుదర్శన భగవానుని పాశమను ఆయుధము మిమ్ములను (మనలను) సంసారబంధమునుండి విడిపించునుగాక.

**13. విహారో యేన దేవస్య విశ్వక్షేత్రకృషీవలః ।**
**వ్యజ్యతేఽనేన సీరేణ నాసీరవిజయోఽస్తు వః (నః) ॥**

భగవానునియొక్క లీలావిహారము ఏ హలమను ఆయుధముచే చేయబడుచున్నదో, ఏ హలాయుధము భగవానుని ప్రపంచమును క్షేత్రమును పండించు వ్యవసాయదారునిగా తెలియజేయుచున్నదో, అట్టి హలాయుధము మీకు (మనకు) యుద్ధరంగమున విజయములను కల్గించును గాక !

**14. ఆయుధానాం మహం వజ్ర మిత్యగీయత య స్స వః (నః)।**
**అవ్యాత్ హేతీశ వజ్రోఽయం దధీచ్యస్థిసముద్భవః ॥**

విభూతిసందర్శనయోగమున **"యద్యత్ విభూతిమత్ సత్వం శ్రీమదూర్జిత మేవ వా, తత్తదేవావగచ్ఛత్వం మమ తేజోఽంశసంభవమ్"** అనుచు శ్రీకృష్ణభగవానుడు గీతలో లోకములోని ఉత్కృష్టములైన వస్తువులన్నియు తన రూపములే అని పల్కు సందర్భమున వజ్రాయుధము తానే అనెను. అట్టి గొప్ప దనమును కల్గినది, భగవత్ స్వరూపాత్మకమైనదగు దధీచిముని వెన్నెముకనుండి నిర్మింపబడిన శ్రీసుదర్శనభగవానుని వజ్రాయుధము మిమ్ములను (మనలను) కాపాడు గాక!

**15. విశ్వసంహృతిశక్తి ర్యా విశ్రుతా బుద్ధిరూపిణీ।**
**సా (నః) సౌదర్శనీ భూయాద్గదప్రశమనీ గదా ॥**

**"సంహృతిక్రీడితమ్"** అను విధముగా భగవానుని లీలలో ఒకటిగా చెప్పబడుట లోకసంహారమునకు మూలమైన శక్తిగా, బుద్ధికి అధిష్ఠానదేవతగా చెప్పబడు శ్రీసుదర్శన భగవానుని గద మీ (మన) మనోవ్యాధులను పోగొట్టును గాక !

భగవద్రామానుజుల మతమును ద్వేషించువారగు పరవాదులను ఎట్లు జయించుట ? అను భీతియే ఇచట మనోవ్యాధి. ఆ వ్యాధిని భగవానుని గద పోగొట్టునుగాక ! అని తాత్పర్యము.

**16. యాత్యతిక్షోదశాలిత్వం ముసలో యేన తేన వః।**
**హేతీశముసలేనాశు భిద్యతాం మోహమౌసలమ్ ॥**

శ్రీ సుదర్శన భగవానుడు ముసలమను ఆయుధం ధరించియున్నాడు. ఆ ముసలము లోకములోని మిగిలిన అన్ని ముసలములలో అనుప్రవేశించినందు వలననే అవి వస్తువులను పొడిచేయు శక్తిని కలిగినవి అయినవి. ఇట్టి ఈ ముసలాయుధము మీకు అజ్ఞానమువలన కలిగిన కాఠిన్యమును త్వరగా పోగొట్టు గాక.

**17. శూలిదృష్టమనో ర్వాచ్యో యేన శూలయతి ద్విషః।**
**భవతాం తేన భవతాత్ త్రిశూలేన విశూలితా ॥**

పరమశివునిచే దర్శింపబడిన శ్రీరామతారకమంత్రమునకు వాచ్యుడగు, భగవానుడగు శ్రీరామచంద్రుడు ఏ త్రిశూలమను ఆయుధముచే శత్రువులను శూలమను వ్యాధిని కల్గినవారిగా బాధించుచున్నాడో, అట్టి శ్రీసుదర్శన భగవానుని త్రిశూల మను ఆయుధము మీ పీడలను అన్నిటిని పోగొట్టునుగాక !



**18. అస్త్రగ్రామస్య కృత్స్నస్య ప్రసూతిం యం ప్రచక్షతే।**
**సోఽవ్యాత్ సుదర్శనో విశ్వ మాయుధైః షోడశాయుధః ॥**

"సర్వాస్త్రములకును కారణమగువాడు, సర్వాయుధములను దాల్చినవాడు, తదనుగుణముగా **"తోళ్గళ్ ఆయిరత్తాయ్"** అనునట్లు సహస్రబాహువులను కలవాడు, శ్రీసుదర్శనరూపి అగు భగవానుడు తన ఆయుధములతో విశ్వమును రక్షించుగాక ! -అని భావము.

**19. శ్రీమద్వేంకటనాథేన శ్రేయసే భూయసే సతామ్।**
**కృతోఽయమాయుధేంద్రస్య షోడశాయుధసంస్తుతిః ॥**

ఈ విధముగా తాము అనుగ్రహించిన స్తోత్రము, పూర్వ శ్లోకమున సూచించిన విధముగా, సర్వప్రయోజనకరమగుటయే కాక, **"సత్సమృద్ధిం చ యుక్తామ్"** అను రచించిన రీతిగా సాధుజనసంతుష్టికరమనియు, దీనిని అనుసంధించువారలకు సకల శ్రేయస్సులు కల్గించుననియు పల్కుచు, గ్రంథ చోరులు తమ గ్రంథమును దొంగిలింపకుండుటకై చివరగా స్వనామాంకిత ముగా శ్రీదేశికులు ఈ శ్లోకమున తెలుపుచున్నారు.

## ముక్తకాలు

1. **నమః ప్రణవశోభితం నవకషాయఖండాంబరం**
**త్రిదండపరిమండితం త్రివిధతత్త్వనిర్వాహకమ్ ।**
**దయాంచితదృగంచలం దళితవాదివాగ్వైభవం**
**శమాదిగుణసాగరం శరణమేమి రామానుజమ్ ॥**

నమశ్శబ్దార్థంచే ప్రతిపాదింపబడే అనన్యశరణత్వంతో, ప్రణవంచేత ప్రతిపాదింపబడే అనన్యార్హ శేషత్వంతో శోభిల్లేవారు, నూతన కాషాయవర్ణాన్ని కల వస్త్రాన్ని ధరించినవారు, త్రిదండంతో అలంకరింపబడినవారు, చేతనాచేతనేశ్వరులనే మూడు తత్త్వాలను నిర్వహించేవారు (ఉజ్జీవింపజేసేవారు), లేక, శరీర –శరీరి భావంతో తత్త్వత్రయాన్ని నిర్వహించినవారు, దయతో అందమైన కటాక్షాలను కలవారు, పరమతవాదుల వాగ్వైభవాన్ని ఖండించినవారు, శమాదిగుణాలకు సముద్రంవంటివారైన శ్రీరామానుజులను ఆశ్రయిస్తున్నాను.

2. **కాషాయశోభి కమనీయశిఖానివేశం**
**దండత్రయోజ్జ్వలకరం విమలోపవీతమ్ ।**
**ఉద్యద్దినేశనిభ ముల్లసదూర్ధ్వపుండ్రం**
**రూపం తవాస్తు యతిరాజ ! దృశోర్మమాగ్రే ॥**

ఓ యతిరాజా ! కాషాయంతో ప్రకాశిస్తున్నది, అందమైన శిఖాసన్నివేశాన్ని కల్గినది, త్రిదండంతో గొప్పగా ప్రకాశించే శ్రీహస్తాన్ని కల్గినది, తెల్లని యజ్ఞోపవీతాన్ని కల్గినది, ఉదయించే సూర్యునివలె ప్రకాశించేది, మిక్కిలిగా వెలిగే ఊర్ధ్వపుండ్రాలను కల్గినది అయిన నీ రూపం, నా కంటిముందు ప్రత్యక్షం కావాలి.

3. **ఏతాని తాని భువనత్రయపావనాని**
**సంసారరోగశలీకరణౌషధాని ।**
**జిహ్వాతలే మమ లిఖాని యథా శిలాయాం**



**రామానుజేతి చతురాణ్యమృతాక్షరాణి ॥**

ముల్లోకాలను పావనం చేస్తున్నవి, సంసారమనే రోగాన్ని నశింపజేసే ఔషధాలవంటివి అయిన **"రామానుజ"** అనే ఈ నాల్గు అమృతాక్షరాలను నా జిహ్వాతలంపై, శిలపై వలె, శాశ్వతంగా వ్రాసికొంటాను.

4. **న చేత్ రామానుజేత్యేషా చతురా చతురక్షరీ ।**
**కామవస్థాం ప్రపద్యంతే జంతవో హంత ! మాదృశః ॥**

**"రామానుజః"** అనే ఈ నాల్గు అక్షరాలను కల సమర్థవంతమైన మంత్రమే లేకపోతే, అయ్యో ! మావంటి జీవులం ఎటువంటి అవస్థను పొందుతాము ?

5. **పుణ్యాంభోజవికాసాయ పాపధ్వాంతక్షయాయ చ ।**
**శ్రీమానావిరభూద్భూమౌ రామానుజదివాకరః ॥**

పుణ్యమనే పద్మం వికసించడంకోసం, పాపమనే చీకటి నశించడం కోసం గొప్ప కాంతిని కల శ్రీరామానుజులనే సూర్యుడు భూమిలో ఉదయించాడు.

6. **తృణీకృతవిరించాది నిరంకుశవిభూతయః ।**
**రామానుజపదాంభోజ సమాశ్రయణశాలినః ॥**

శ్రీరామానుజుల పదపద్మాలను ఆశ్రయించడంవల్ల ప్రకాశించేవారు. బ్రహ్మాదుల నిరంకుశమైన ఐశ్వర్యాలనుకూడా తృణంగా తలుస్తారు.

7. **శ్రీమద్రంగం జయతు పరమం ధామ తేజోనిధానం**
**భూమా తస్మిన్ భవతు కుశలీ కోఽపి భూమాసహాయః ।**
**దివ్యం తస్మై దిశతు విభవం దేశికో దేశికానాం**
**కాలే కాలే వరవరమునిః కల్పయన్ మంగళాని ॥**

గొప్ప స్థానం, తేజస్సుకు నిలయమైన శ్రీరంగక్షేత్రం వర్ధిల్లాలి. అక్కడ వేంచేసి ఉండేవాడు, అని నిర్వచనీయమైన వైభవాన్ని కల్గినవాడు, భూదేవి, లక్ష్మీదేవులతో కలసి ఉండేవాడు అద్వితీయుడైన శ్రీరంగనాథ భగవానుడు కుశలం

కలవాడు కావాలి. ఆచార్యులకు ఆచార్యులైన వరవరమునులు ప్రతిసమయంలోను ఆ శ్రీరంగనాథునకు మంగళాలను కల్గించి, దివ్యమైన వైభవాన్ని కల్గించాలి.

**8.** **అపగతమదమానైః అంతిమోపాయనిష్ఠైః**
**అధిగతపరమార్థైః అర్థకామానపేక్షైః ।**
**నిఖిలజనసుహృద్భిః నిర్జితక్రోధలోభైః**
**వరవరమునిభృత్యైః అస్తు మే నిత్యయోగః ॥**

మదం, దురభిమానం లేనివారు, చరమపర్వనిష్ఠను కలవారు, పరమార్థాన్ని పొందినవారు, (అందువల్లనే లౌకికమైన, అథమమైన) అర్థకామాలలో అపేక్ష లేనివారు, (అందువల్లనే) జనులందఱిపట్ల సుహృద్భావాన్ని కలవారు, (అందువల్లనే) క్రోధాన్ని, లోభాన్ని లేనివారైన వరవరముని శిష్యులతో నాకు నిత్యమైన సంబంధం కలగాలి.





## శాత్తుముఱై (మంగళాశాసన) క్రమము

శ్లో ॥1. లక్ష్మీచరణలాక్షాంక సాక్షిశ్రీవత్సవక్షసే ।
క్షేమంకరాయ సర్వేషాం శ్రీరంగేశాయ మంగళమ్ ॥

2. శ్రియః కాంతాయ కల్యాణనిధయే నిధయేఽర్థినామ్ ।
శ్రీవేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥

3. అస్తు శ్రీస్తనకస్తూరీవాసనావాసితోరసే ।
శ్రీహస్తిగిరినాథాయ దేవరాజాయ మంగళమ్ ॥

4. కమలాకుచకస్తూరీ కర్దమాంకితవక్షసే ।
యాదవాద్రినివాసాయ సంపత్పుత్రాయ మంగళమ్ ॥

5. మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాబ్ధయే ।
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్ ॥

6. అస్తు గోపాలబాలాయ నిత్యాయ పరమాత్మనే ।
భక్తవాత్సల్యనిధయే నిత్యభోగ్యాయ మంగళమ్ ॥

7. కర్కటే పూర్వఫల్గున్యాం జాతాయై తులసీవనే ।
విష్ణుచిత్తతనూజాయై గోదాయై నిత్యమంగళమ్ ॥

8. శ్రీనగర్యాం మహాపుర్యాం తామ్రపర్ణ్యుత్తరే తటే ।
శ్రీతింత్రిణీమూలధామ్నే శఠకోపాయ మంగళమ్ ॥

9. శేషో వా సైన్యనాథో వా శ్రీపతి ర్వేతి సాత్త్వికైః ।
వితర్క్యాయ మహాప్రాజ్ఞైః భాష్యకారాయ మంగళమ్ ॥

10. తులామూలావతీర్ణాయ తోషితాఖిలసూరయే ।
రమ్యజామాతృమునయే శేషాంశాయాస్తు మంగళమ్ ॥

11. మంగళాశాసనపరైః మదాచార్యపురోగమైః ।
సర్వై శ్చ పూర్వైరాచార్యైః సత్కృతాయాస్తు మంగళమ్ ॥

# లక్ష్మీగద్యమ్

## మూలము

**1.** ఓమ్. భగవన్నారాయణాభిమతానురూప స్వరూపరూపగుణ విభవైశ్వర్య శీలాద్యనవధికాతిశయాఽసఙ్ఖ్యేయ కల్యాణగుణగణాం, పద్మవనాలయాం, భగవతీం, శ్రియం, దేవీం, నిత్యానపాయినీం, నిరవద్యాం, దేవదేవదివ్య మహిషీమ్, అఖిలజగన్మాతరమ్, అస్మన్మాతరమ్, అశరణ్యశరణ్యామ్, అనన్యశరణ శ్శరణమహం ప్రపద్యే.

**భగవత్+నారాయణ** = జ్ఞానశక్తిబలైశ్వర్యాది సకలకల్యాణగుణ పరిపూర్ణుడైన నారాయణునకు, **అభిమత+అనురూప** = ఇష్టంగాను, తగినవిగాను ఉండే, **స్వరూప రూపగుణవిభవ** = స్వరూపం, విగ్రహం, విగ్రహ గుణాలు, విభూతులు- అనే వీటిని, **ఐశ్వర్య శీల+ఆది** = ఐశ్వర్యం, సౌశీల్యం మొదలైన, **అనవధిక+ అతిశయ**= ఎల్ల లేని గొప్పతనాన్ని కల, **అసంఖ్యేయ** = లెక్కలేనన్ని, **కల్యాణగుణగణామ్** = కల్యాణగుణాల సమూహాలను కల్గినది, **పద్మవన + ఆలయామ్** = కమలవనాన్ని వాసస్థానంగా కల్గినది, **దేవీం** = గొప్ప కాంతితో నిండిన రూపాన్ని కల్గినది, **నిత్య+అనపాయినీం** = (భగవానుని) ఏనాడూ విడిచిపెట్టి ఉండనిది, **నిరవద్యాం**= (దోషాలను లేనిది) పరిశుద్ధిని కల్గినది, **దేవదేవదివ్యహిషీం** = దేవాధిదేవుడైన భగవానుని దివ్యమహిషి, **అఖిలజగత్+ మాతరం**=అన్నిలోకాలకు తల్లి, **అస్మత్+మాతరం** = (విశేషించి) మాకు తల్లి, **అశరణ్యశరణ్యాం**= ఏ దిక్కు లేనివారి గొప్ప దిక్కు అయిన, **శ్రియం** = లక్ష్మిని (శ్రీరంగ నాయకిని), **అనన్యశరణః అహం**= వేఱు గతి లేనివాడనైన నేను, **శరణం ప్రపద్యే** = శరణు పొందుతున్నాను.



# దేవరాజాష్టకం

## తిరుక్కచ్చినమ్బి తనియన్‌లు

**శ్రీమత్కాంచీమునిం వందే కమలాపతినందనమ్ ।**
**వరదాంఘ్రిసదాసంగరసాయనపరాయణమ్ ॥**

వరదరాజస్వామి శ్రీచరణాలలో నిరంతరమైన సంగం (భక్తి) అనే రసాయనాన్ని పరాయణంగా కలవారు (వరదరాజస్వామి విషయంలో అచంచలమైన భక్తిని కలవారు), కమలాపతి అనే మహనీయుల కుమారులు అయిన శ్రీ కాంచీపూర్ణమునికి నమస్కరిస్తున్నాను.

**దేవరాజదయాపాత్రం శ్రీకాంచీపూర్ణ ముత్తమమ్ ।**
**రామానుజమునే ర్మాన్యం వందేఽహం సజ్జనాశ్రయమ్ ॥**

వరదరాజస్వామి అనుగ్రహానికి పాత్రమైనవారు, చాలా గొప్పవారు, శ్రీరామానుజులకు పూజనీయులు, సత్పురుషులకు ఆశ్రయమైనవారైన కాంచీపూర్ణులను నమస్కరిస్తున్నాను.

**నమ స్తే హస్తిశైలేశ ! శ్రీమన్ ! అంబుజలోచన !**
**శరణం త్వాం ప్రపన్నోఽస్మి ప్రణతార్తిహరాచ్యుత ॥**

శ్రీహస్తిగిరినాథా ! పెరున్దేవితాయార్‌కు నాథుడైనవాడా ! (లక్ష్మీనాథా!) తామరలవంటి కన్నులను కలవాడా ! దాసుల దుఃఖాలను తీర్చేవాడా ! ఆశ్రితులను ఏ నాడూ విడువని అచ్యుతా ! నీకు నమస్కారం. నిన్ను శరణు పొందుతున్నాను.

**సమస్తప్రాణిసంతానప్రవీణ ! కరుణోల్బణ !**
**విలసంతు కటాక్షా స్తే మయ్యస్మిన్ జగతాం పతే ॥**

సకలచేతనాలను రక్షించడంలో సమర్థుడవైనవాడా ! అతిశయించిన కరుణను కలవాడా ! లోకాలకు అన్నిటికి ప్రభూ ! ఈ దాసుని విషయంలో నీ కటాక్షాలను ప్రకాశింపజేయాలి.

నిందితాచారకరణం నివృత్తం కృత్యకర్మణః ।
పాపీయాంస మమర్యాదం పాహి మాం వరద ! ప్రభో ! ॥

వరదరాజస్వామీ ! శాస్త్రాలలో చేయరాదని నిషేధింపబడ్డ కర్మలు చేసేవాడను, శాస్త్రవిహితాలైన- అంటే- తప్పకుండా చేయాలని విధింపబడ్డ కర్మలను చేయనివాడను, పాపిష్ఠివాడను, మర్యాదను అతిక్రమించినవాడను అయిన నన్ను (దాసుణ్ణి) రక్షించాలి.

సంసారమరుకాంతారదుర్వ్యాధివ్యాఘ్రభీషణే ।
విషయక్షుద్రగుల్మాఢ్యే తృషాపాదపశాలిని ॥

పుత్రదారగృహక్షేత్రమృగతృష్ణాంబుపుష్కలే ।
కృత్యాకృత్యవివేకాంధం పరిభ్రాంత మిత స్తతః ॥

అజస్రం జాతతృష్ణార్త మవసన్నాంగ మక్షమమ్ ।
క్షీణశక్తిబలారోగ్యం కేవలం క్లేశసంశ్రయమ్ ॥

సంతప్తం వివిధై ర్దుఃఖై: దుర్వచై రేవమాదిభిః ।
దేవరాజ ! దయాసింధో ! దేవదేవ ! జగత్పతే ॥

త్వదీక్షణసుధాసింధువీచివిక్షేపశీకరైః ।
కారుణ్యమారుతానీతైః శీతలై రభిషించ మామ్ ॥

కరుణాసముద్రా ! వరదరాజస్వామీ ! దేవాధిదేవా ! లోకాలకు పతి అయినవాడా ! క్రూరవ్యాధులనే పులులచేత భయంకరమైనది, లౌకికసుఖాలనే క్షుద్రమైన ముళ్ళపొదలతో నిండినది, ఆశలనే మహావృక్షాలతో దట్టమైనది, పుత్రులు, భార్య, ఇల్లు, ఆస్తి- అనే ఎండమావుల నీటితో నిండినది అయిన సంసారం అనే భయంకరారణ్యంలో "ఇది చేయదగినది, ఇది చేయకూడనిది" అనే వివేకాన్ని ఏమాత్రం లేకుండా ఎక్కడెక్కడో తిరిగి తిరిగి అల్లాడి, నిరంతరం విషయతృష్ణార్తుడనవై, శరీరం కృశించినవాడనై, అసమర్థుడనై, శక్తి, బలం ఆరోగ్యం- అనే వీటిలో దేనినీ లేనివాడనై, పలు క్లేశాలతో పూర్తిగా తపింపబడ్డవాడనై, చెప్పడానికి వీలు కాని, ఇటువంటి పలు రీతులలోని బాధలతో ఆర్తుడనై ఉండే నన్ను నీ కరుణ అనే వాయువుచేత ప్రేరేపింపబడ్డవి, చల్లనివి అయిన నీ కటాక్షామృత నదీప్రవాహతరంగాలతో అభిషేకించు.



# ముకున్దమాలా

**ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినే దినే ।**
**తమహం శిరసా వన్దే రాజానం కులశేఖరమ్ ॥**

ఏకులశేఖరుల నగరంలో ప్రతిదినం శ్రీరంగయాత్ర అనే శబ్దం జనులచే ఘోషింపబడుతున్నదో ఆ ప్రభువు కులశేఖరులను నేను శిరసా నమస్కరిస్తున్నాను.

**శ్రీవల్లభేతి వరదేతి దయాపరేతి భక్తప్రియేతి భవలుణ్ఠనకోవిదేతి ।**
**నాథేతి నాగశయనేతి జగన్నివాసేతి ఆలాపినం ప్రతిపదం కురు మాం ముకున్ద॥ 1**

ఉభయవిభూతులను అనుగ్రహించే ముకుందా! అని, లక్ష్మీవల్లభా!, అని దాసులు కోరిన వరాలను ప్రదానం చేసేవాడా!, అని, భక్తులు అనుభవించే దుఃఖాలను చూచి సహించలేని దయాస్వభావాన్ని కలవాడా! అని, భక్తులకు ప్రియమైనవాడా! అని, సంసారాన్ని తొలగించడంలో సమర్థుడా! అని, సర్వస్వామీ! అని, శేషశయనా! అని, జగత్తులకు అన్నిటికీ నీ ఉదరాన్ని నివాసంగా చేసినవాడా! అని (నిన్ను గూర్చి) ప్రతిదినం పలికేవానినిగా నన్ను చేయాలి.

**జయతు జయతు దేవో దేవకీనన్దనోఽయం**
**జయతు జయతు కృష్ణో వృష్ణివంశప్రదీపః ।**
**జయతు జయతు మేఘశ్యామలః కోమలాఙ్గః**
**జయతు జయతు పృథ్వీభారనాశో ముకున్దః ॥ 2**

ఈ దేవుడైన దేవకీపుత్రుడు వర్ధిల్లాలి! వర్ధిల్లాలి! వృష్ణి అనే వంశానికి దీపంవలె వెలిగే శ్రీకృష్ణుడు వర్ధిల్లాలి! వర్ధిల్లాలి! కాలమేఘంవంటి నల్లని రూపాన్ని కల, అందమైన సుకుమారమైన తిరుమేనిని కల శ్రీకృష్ణుడు వర్ధిల్లాలి! వర్ధిల్లాలి! భూమికి భారమైన దుష్టులను నశింపజేసే శ్రీకృష్ణుడు వర్ధిల్లాలి! వర్ధిల్లాలి.

**ముకున్ద! మూర్ధ్నా ప్రణిపత్య యాచే భవన్త మేకాన్త మియన్తమర్థమ్।**
**అవిస్మృతి స్త్వచ్చరణారవిన్దే భవే భవే మేఽస్తు భవత్ప్రసాదాత్ ॥ 3**

భుక్తిముక్తులను అనుగ్రహించే ఓ ముకుందా! నిన్ను శిరసా సేవించి ఏతావన్మాత్రమైన అర్థాన్నిమాత్రం ప్రార్థిస్తున్నాను (అది ఏమి? అంటే) నా ప్రతిజన్మలోను నీ అనుగ్రహంవల్ల నీ చరణారవిందాలను నేను మఱువకుండా ఉండాలి.

**నాహం వన్దే తవ చరణయోః ద్వంద్వ మద్వంద్వహేతోః**
**కుంభీపాకం గురుమపి హరే! నారకం నాపనేతుమ్ ।**
**రమ్యా రామా మృదుతనులతా నన్దనేనాపి రన్తుమ్**
**భావే భావే హృదయభవనే భావయేయం భవన్తమ్ ॥ 4**

నేను నీ శ్రీచరణద్వయిని సుఖదుఃఖాలనే ద్వంద్వాన్ని నివర్తింపజేసికోవడానికై సేవించను. కుంభపాకమనే పేరును కల గొప్ప నరకాన్ని పోగొట్టుకోవడంకోసం కూడా నీ చరణద్వయిని సేవించడం లేదు. అందమైన, సుకుమారమైన లతవంటి శరీరాలను కల స్త్రీల (అప్సరసల) నందనవనంలో అనుభవించడంకోసమై నీ శ్రీచరణద్వయిని సేవించడం లేదు. (అయితే, ఎందుకోసం సేవిస్తున్నావు మఱి? అని అంటే), భక్తుల తాపాలను (దుఃఖాలను) హరించే ఓ హరీ! ప్రతిజన్మలోను, నా హృదయమనే భవనంలో నిన్ను ధ్యానించాలి. ఈ ప్రయోజనాన్ని పొందడం కోసమే నేను నీ శ్రీచరణద్వయిని సేవిస్తున్నాను.

**నాస్థా ధర్మే న వసునిచయే నైవ కామోపభోగే**
**యద్యద్భవ్యం భవతు భగవన్! పూర్వకర్మానురూపమ్ ।**
**ఏతత్ ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాంతరేఽపి**
**త్వత్పాదాంభోరుహయుగగతా నిశ్చలా భక్తి రస్తు ॥ 5**

షాడ్గుణ్యపూర్ణుడవైన స్వామీ! నాకు ఆముష్మికసాధనమైన ధర్మంలో ఆశ లేదు. ఐహికసాధనమైన అర్థనిచయం (సమూహం) లోను ఆశ లేదు. విషయభోగాల లోను ఆశ లేనేలేదు. పూర్వంచేసిన కర్మలకు అనుగుణమైనది ఏది ఏది జరుగబోతున్నదో అది అది అంతా జరుగనీ. అయితే, "నీపాదారవిందాలలోని భక్తిమాత్రం ప్రతిజన్మలోను నిశ్చలంగా ఉండాలి"- అనేది మాత్రం నాకు మిక్కిలి ఇష్టమైనది, ప్రార్థించదగినది.

**దివి వా భువి వా మమాస్తు వాసః నరకే వా నరకాన్తక! ప్రకామమ్ ।**
**అవధీరితశారదారవిన్దౌ చరణౌ తే మరణేఽపి చిన్తయాని ॥ 6**

ఓ నరకాంతకా! నాకు స్వర్గంలో కాని, నరకంలో కాని, ఇష్టప్రకారం వాసం కలుగనీ. శరత్కాలంలోని తామరపూవును జయించే (శరత్కాలతామరపూవుకంటే అందమైన) నీ శ్రీచరణాలను నేను నా సకలేంద్రియాలు పనిచేయని మరణ సమయంలోకూడా ధ్యానించగలగాలి.



**కృష్ణ! త్వదీయపదపంకజపంజరాన్తః అద్యైవ మే విశతు మానసరాజహంసః।**
**ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః కణ్ఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే॥ 7**

ఓ శ్రీకృష్ణా! నా ప్రాణం పోయేటపుడు కఫవాతపిత్తాలతో కంఠం అవరుద్ధమై పలుకు బయటకు రానిసమయంలో నీ స్మరణం అనేది నాకు ఏవిధంగా కల్గుతుంది! కలుగదుకదా! అందువల్ల, నా మనస్సు అనే రాజహంస నీచరణ పంకజాలనే పంజరంలోపలకు ఇపుడే ప్రవేశించాలి. (ఇపుడే నిన్నుగూర్చిన స్మరణ ధ్యానాదులు నాకు కలగాలి).

**చిన్తయామి హరిమేవ సన్తతం మన్దమన్దహసితాననామ్బుజమ్ ।**
**నన్దగోపతనయం పరాత్పరం నారదాదిమునిబృన్దవన్దితమ్ ॥ 8**

చిఱునవ్వు నవ్వే, తామరపూవువంటి ముఖాన్ని కలవాడు, నారదుడు మొదలైన మునిగణాలచే నమస్కరింపబడినవాడు, పరాత్పరుడు (గొప్పవారందఱికంటే చాలా గొప్పవాడు), పాపాలను పోగొట్టేవాడు, నందగోపుని తనయుడు అయిన శ్రీకృష్ణునే నిత్యం చింతిస్తున్నాను.

**కరచరణసరోజే కాన్తిమన్నేత్రమీనే శ్రమముషి భుజవీచివ్యాకులేఽగాధమార్గే।**
**హరిసరసి విగాహ్యాపీయ తేజోజలౌఘం భవమరుపరిఖిన్నః ఖేద మద్య త్యజామి॥ 9**

శ్రీహస్తాలు, శ్రీచరణాలు అనే పద్మాలను కల్గినది, అందమైన మెఱిసే కన్నులనబడే మత్స్యాలను కల్గినది, భక్తుల చిత్తశ్రమను తీర్చే భుజాలనబడే అలలతో నిండినది, మిక్కిలి గంభీరమైనది అయిన భగవానుడనే తటాకంలో బాగా లోపలకు దిగి స్నానమాడి, ఆ స్వామి తిరుమేనిలో వెలిగే తేజస్సు అనే జలసమూహాన్ని పానం చేసి, సంసారమనే ఎడారిప్రాంతంలో పరిభ్రమించడంవల్ల మిక్కిలి ఆర్తిని చెందిన నేను ఆ సాంసారికఖేదాన్ని ఇపుడు విడుస్తున్నాను (పోగొట్టుకున్నాను).

**సరసిజనయనే సశఙ్ఖచక్రే మురభిది మా విరమస్వ చిత్త! రన్తుమ్ ।**
**సుఖతరమపరం న జాతు జానే హరిచరణస్మరణామృతేన తుల్యమ్ ॥ 10**

(నాకు సంపదవంటి) ఓ మనసా! తామరలవంటి నేత్రాలను కలవాడు, శంఖ చక్రాలను ధరించినవాడు, మురుడనే అసురుని వధించినవాడైన శ్రీకృష్ణుని విషయం లో భక్తిని కల్గి ఆనందించడం ఒక్కక్షణం కూడా మానివేయకు. భగవానుని శ్రీచరణా లను చింతించడమనే విషయాన్ని తప్ప అమృతంతో సమానమైనది, మిక్కిలి సుఖకరమైనది అయిన వేఱొక విషయాన్ని దేనినీ నేను ఏనాడూ తెలియను.

మాభీర్మంద! మనో విచింత్య బహుధా యామీ శ్చిరం యాతనాః
నామీ నః ప్రభవన్తి పాపరిపవః స్వామీ నను శ్రీధరః ।
ఆలస్యం వ్యపనీయ భక్తిసులభం ధ్యాయస్వ నారాయణం
లోకస్య వ్యసనాపనోదనకరో దాసస్య కిం న క్షమః ॥ 11

ఓ! అల్పమైన మనసా! యముడు పెట్టే యాతనలను చిరకాలంగా పలు రీతులలో చింతించి నీవు భయపడవద్దు. ఈ పాపాలనే శత్రువులు మనలను ఇక శాసించలేవు. ఎందుకు? అంటావా, శ్రియఃపతి మన స్వామిగా ఉన్నాడుకదా! సోమరితనాన్ని వీడి భక్తికి సులభుడైన శ్రీమన్నారాయణుని ధ్యానం చేయి. లోకానికి అంతటికీ దుఃఖాన్ని పోగొట్టే ఆ స్వామి తనకు దాసుడనైన నా పాపాలను పోగొట్టడా! ఏమి?

భవజలధిగతానాం ద్వంద్వవాతాహతానాం
సుతదుహితృకళత్రత్రాణభారార్దితానామ్ ।
విషమవిషయతోయే మజ్జతా మప్లవానాం
భవతు శరణ మేకో విష్ణుపోతో నరాణామ్ ॥ 12

సంసారమనే సాగరంలో పడినవారు, సుఖదుఃఖాలనే గొప్ప గాలిచేత బాగా కొట్టబడిన వారు, కుమారులు, కుమార్తెలు, భార్య - అనేవారిని రక్షించడమనే భారంవల్ల పీడింపబడినవారు, క్రూరమైన శబ్దాదివిషయాలనే జలంలో మునిగినవారు, ఈ విధమైన సంసారసాగరాన్ని దాటడానికి తగిన నావను లేనివారు అయిన మానవులకు విష్ణువు అనే తెప్ప ఒక్కటే రక్షకం (శరణం) కావాలి.

భవజలధిమగాధం దుస్తరం నిస్తరేయం
కథ మహ మితి చేతో! మా స్మ గాః కాతరత్వమ్ ।
సరసిజదృశి దేవే తావకీ భక్తిరేకా
నరకభిది నిషణ్ణా తారయిష్యత్యవశ్యమ్ ॥ 13

ఓ మనసా! లోతైనది, స్వప్రయత్నంతో దాటడానికి సాధ్యం కానిది అయిన సంసారసాగరాన్ని నేను ఏ విధంగా దాటగలను? అనే భయపడిన స్థితిని పొందకు. భయపడను. నరకాసురుని వధించినవాడు, తామరపూలవంటి శ్రీచరణాలను కలవాడు అయిన దేవుని విషయంలో నీకు గల భక్తి ఒక్కటే నిన్ను తప్పక ఆ సంసారసాగరాన్ని దాటిస్తుంది.



తృష్ణాతోయే మదనపవనోద్ధూతమోహోర్మిమాలే
దారావర్తే తనయసహజగ్రాహసంఘాకులే చ ।
సంసారాఖ్యే మహతి జలధౌ మజ్జతాం నస్త్రిధామన్!
పాదామ్భోజే వరద! భవతో భక్తినావం ప్రయచ్ఛ ॥ 14

పరమపదం - పాలకడలి - తిరుమల - అనే మూడు చోట్ల వేంచేసి ఉండే ఓ వరదా! ఆశలనే జలాన్ని కల్గినది, మన్మథుడనే వాయువుచే కలత పొందింపబడిన మోహమనే అలలు వరుసలను కల్గినది, భార్య అనే సుడిగుండాలను కల్గినది, తనయులు, సోదరులు అనే మొసళ్ళ గుంపులచే కలత పొందింపబడినది, సంసారమనే పేరును కల్గినది అయిన గొప్పసముద్రంలో మునుగుతున్న మాకు నీ శ్రీచరణాలలోని భక్తి అనే ఓడను అనుగ్రహించాలి.

మా ద్రాక్షం క్షీణపుణ్యాన్ క్షణమపి భవతో భక్తిహీనాన్ పదాబ్జే
మాశ్రౌషం శ్రావ్యబన్ధం తవ చరిత మపాస్యాన్యదాఖ్యానజాతమ్ ।
మా స్మార్షం మాధవ! త్వామపి భువనపతే! చేతసాఽపహ్నువానాన్
మాభూవం త్వత్సపర్యావ్యతికరరహితో జన్మజన్మాంతరేఽపి॥ 15

ఓ జగత్పతీ! నీపాదాంబుజాలలో క్షణంకాలం అయినా భక్తి లేని దౌర్భాగ్యులను నేను ఒక్కక్షణంకూడా చూడను. వినడానికి చాలా శ్రావ్యంగా ఉండే నీ చరిత్రలను విడచి వేఱు ఏ ప్రబంధాలను చెవులతో వినను. ఓ శ్రియఃపతీ! నిన్ను కాదనేవారిని మనస్సుతో అయినా భావించను. జన్మజన్మాంతరాలలో నీ ఆరాధనను చేయనివాడనై ఉండబోను.

జిహ్వే! కీర్తయ కేశవం మురరిపుం చేతో! భజ శ్రీధరం
పాణిద్వంద్వ! సమర్చయాఽచ్యుతకథాః శ్రోత్రద్వయ! త్వం శృణు!
కృష్ణం లోకయ లోచనద్వయ! హరేర్గచ్ఛాఙ్ఘ్రియుగ్మాలయం
జిఘ్ర! ఘ్రాణ ముకున్దపాదతులసీం మూర్ధన్! నమాధోక్షజమ్ ॥ 16

ఓ నాలుకా! కేశి అనే అసురుని వధించిన శ్రీకృష్ణుని కీర్తించు. ఓ మనసా! మురహరుని ఆశ్రయించు. ఓపాణియుగ్మమా! శ్రీధరుని ఆరాధించండి. ఓ రెండు చెవులారా! అచ్యుతుని (భక్తులను ఏనాడూ విడువని అచ్యుతుని) కథలను మీరు వినండి. ఓ రెండు నేత్రాలలారా! శ్రీకృష్ణుని దర్శించండి. ఓ రెండు పాదాల లారా! హరియొక్క సన్నిధికి వెళ్ళండి. ఓ నాసికా! శ్రీకృష్ణుని శ్రీచరణాలలో అర్పించిన తులసిని ఆఘ్రాణించు. ఓ శిరసా! అధోక్షజునకు నీవు నమస్కరించు.

హే లోకాః! శృణుత ప్రసూతిమరణవ్యాధేః చికిత్సా మిమాం
యోగజ్ఞాః సముదాహరంతి మునయో యాం యాజ్ఞ్యవల్క్యాదయః ।
అన్తర్జ్యోతి రమేయ మేక మమృతం కృష్ణాఖ్య మాపీయతాం
తత్పీతం పరమౌషధం వితనుతే నిర్వాణ మాత్యన్తికమ్ ॥ 17

ఓ జనులారా! యోగమార్గాన్ని తెలిసినవారైన యాజ్ఞవల్క్యమహర్షి మొదలైన మునులు జన్మమరణరూపమైన వ్యాధికి చికిత్సగా దేనిని ఉదాహరిస్తున్నారో, ఆ ఈ చికిత్సనుగూర్చి చెబుతున్నాను. మీరు వినండి. అందఱి లోపల జ్యోతిర్మయంగా వేంచేసి ఉన్నది, పరిచ్ఛేదించి ఇంతటిది అని చెప్పడానికి సాధ్యం కానిది, శ్రీ కృష్ణుడనే పేరును కల్గినది అయిన అమృతం ఒక్కటిని మాత్రం తాగండి. ఆ గొప్ప ఔషధాన్ని తాగితే చాలు; అది శాశ్వతమైన సౌఖ్యాన్ని ఇస్తుంది.

హే మర్త్యాః! పరమం హితం శ్రుణుత వో వక్ష్యామి సంక్షేపతః
సంసారార్ణవ మాపదూర్మిబహుళం సమ్యక్ప్రవిశ్య స్థితాః ।
నానాజ్ఞాన మపాస్య చేతసి నమో నారాయణాయేత్యముం
మంత్రం సప్రణవం ప్రణామసహితం ప్రావర్తయధ్వం ముహుః ॥ 18

ఆపదలనే అలలతో నిండిన సంసారమనబడే సాగరంలో బాగా లోతుకు మునిగిపోయిన ఓ సంసారిమానవులారా! మీకు చాలా గొప్పదైన హితాన్నిగూర్చి సంగ్రహంగా చెబుతున్నాను వినండి. అది ఏమంటే - పలు విధాలైన అజ్ఞానాలను పోగొట్టి, ఓకారంతో కూడిన **"నమో నారాయణాయ"** అనే ఈ మంత్రాన్ని మనస్సులో మాటిమాటికి ప్రణామపూర్వకంగా అనుసంధించండి. (ఇదే నేను మీకు తెలిపే గొప్ప హితం).

పృథ్వీ రేణు రణుః పయాంసి కణికాః ఫల్గు స్ఫులిఙ్గో లఘుః
తేజో నిఃశ్వసనం మరుత్తనుతరం రంధ్రం సుసూక్ష్మం నభః ।
క్షుద్రా రుద్రపితామహప్రభృతయః కీటా స్సమస్తా స్సురాః
దృష్టే యత్ర స తావకో విజయతే భూమావధూతావధిః ॥ 19

ఏ మహిమను దర్శించగానే భూమి స్వల్పమైన రేణువులుగాను, జలద్రవ్యం చిన్న చిన్న తంపురులుగాను, తేజోద్రవ్యం అతిక్షుద్రమైన నిప్పునెరసులు గాను, వాయుతత్త్వం చాలా అల్పమైన నిశ్శ్వసనం (ఊపిరి) గాను, విభువైన ఆకాశం మిక్కిలి సూక్ష్మమైన ద్వారంగాను, శివుడు, బ్రహ్మ మొదలైన దేవతలందరు అల్ప



కీటకాలుగాను కన్పిస్తున్నారో, అటువంటి, అంతు లేని, నీకు చెందిన మహిమ, ఓ స్వామీ! నిత్యం వర్ధిల్లుతున్నది.

బద్ధేనాఞ్జలినా నతేన శిరసా గాత్రై స్సరోమోద్గమైః
కణ్ఠేన స్వరగద్గదేన నయనేనోద్గీర్ణబాష్పామ్బునా ।
నిత్యం త్వచ్చరణారవిన్దయుగళధ్యానామృతాస్వాదినామ్
అస్మాకం సరసీరుహాక్ష! సతతం సంపద్యతాం జీవితమ్ ॥ 20

తామరలవంటి తిరునేత్రాలను కల ఓ స్వామీ! జోడింపబడ్డ (చేర్చబడ్డ) అంజలి ముద్రతో (అంజలి బంధంతో), వంచిన తలతో, రోమాంచంతోకూడిన అంగాలతో, గద్గదస్వరంతోకూడిన కంఠంతో, స్రవించే బాష్పాలను కల నేత్రాలతో, నిత్యం తమ రెండు శ్రీచరణ పద్మయుగళాల ధ్యానమనే అమృతాన్ని ఆస్వాదించే నీ దాసులమైన మాకు జీవితం సతతం (ఈవిధంగానే) ఏ కొఱత లేకుండా సాగాలి.

హే గోపాలక! హే కృపాజలనిధే! హే సిన్ధుకన్యాపతే!
హే కంసాన్తక! హే గజేంద్రకరుణాపారీణ! హే మాధవ ।
హే రామానుజ! హే జగత్త్రయగురో! హే పుణ్డరీకాక్ష! మాం
హే గోపీజననాథ! పాలయ పరం జానామి న త్వాం వినా ॥ 21

ఓ గోవులను కాచిన స్వామీ! కరుణాసముద్రా!, పాలకడలిలో అవతరించిన లక్ష్మీదేవికి వల్లభుడా! కంసుని సంహరించినవాడా! గజేంద్రునకు కరుణను చూపినవాడా!, మాధవా! బలరామునకు తమ్ముడవై అవతరించినవాడా! ఓ జగద్గురూ! పుండరీకాక్షా! గోపికలకు స్వామీ! నీ దాసుడనైన నన్ను రక్షించు. నిన్ను తప్ప వేఱొక శరణాన్ని నేను తెలియను.

భక్తాపాయభుజఙ్గగారుడమణిః త్రైలోక్యరక్షామణిః
గోపీలోచనచాతకామ్బుదమణిః సౌన్దర్యముద్రామణిః ।
యః కాన్తామణిరుక్మిణీఘనకుచద్వంద్వైకభూషామణిః
శ్రేయో దేవశిఖామణిః దిశతు నో గోపాలచూడామణిః ॥ 22

భక్తుల ఆపదలనే సర్పాలకు గరుడపచ్చవంటివాడు, ముల్లోకాలను రక్షించడం కోసం ఏర్పడిన మణివంటివాడు, చాతకపక్షులను మేఘాలు ఆనందింపజేసినట్లు గోపికల నేత్రాలకు మహోత్సవంగా ఉండేవాడు, లోకంలో ఉండే అందాలు అన్నీ పోగుచేసి ముద్రించినట్లుండే పరమసుందరుడు, రుక్మిణీదేవీస్తనతటాలలో సాటి లేని మేటి నీలమణి పొదిగినట్లు వెలిగేవాడు, జ్ఞానంలో గొప్పవారైన దేవతలకు,

కుడిచేయి ఎడమ చేయి - అనే భేదాన్నికూడా తెలియని గోపికులకు నాయకుడు అయిన శ్రీకృష్ణుడే మనకు సకలశ్రేయస్సులను ఇవ్వాలి.

**శత్రుచ్ఛేదైకమన్త్రం సకల ముపనిషద్వాక్యసమ్పూజ్యమన్త్రం**
**సంసారోత్తారమన్త్రం సముపచితతమస్సంఘనిర్యాణమన్త్రమ్ ।**
**సర్వైశ్వర్యైకమన్త్రం వ్యసనభుజగసన్దష్టసన్త్రాణమన్త్రం**
**జిహ్వే! శ్రీకృష్ణమన్త్రం జప జప సతతం జన్మసాఫల్యమన్త్రమ్ ॥ 23**

శత్రువులను నశింపజేసే మంత్రం, వైదికవాక్యాలచే మిక్కిలి పూజ్యంగా చెప్పబడ్డ మంత్రం, సకలవిధాలైన ఐశ్వర్యాలను ఇవ్వగల్గిన మంత్రం, దుఃఖాలనే సర్పాలచే కఱువబడ్డవారిని కాపాడే మంత్రం, సంసారంనుండి గట్టెక్కించ గల్గిన మంత్రం, మిక్కిలి వృద్ధిచెందే అజ్ఞానతమస్సును పోగొట్టగల్గిన మంత్రం, జన్మకు ఫలాన్ని ఇచ్చే మంత్రం అయిన సమస్తమైన శ్రీకృష్ణమంత్రాన్ని ఓ జిహ్వా! నీవు ఎల్లప్పుడు నిరంతరం జపించు.

**వ్యామోహప్రశమౌషధం మునిమనోవృత్తిప్రవృత్త్యౌషధం**
**దైత్యేంద్రార్తికరౌషధం త్రిభువనీసంజీవనైకౌషధమ్ ।**
**భక్తాత్యన్తహితౌషధం భవభయప్రధ్వంసనైకౌషధం**
**శ్రేయఃప్రాప్తికరౌషధం పిబ మనః! శ్రీకృష్ణదివ్యౌషధమ్ ॥ 24**

ఓ మనసా! విషయాంతరాలలో ఉండే వ్యామోహాన్ని పోగొట్టగల్గిన మందు, మునివరుల మనస్సును తనపట్ల ప్రవర్తించేటట్లు చేయగల మందు, అసురుల ప్రభువైన కాలనేమి మొదలైనవారికి తీరని ఆర్తిని కల్గించే మందు, ముల్లోకాల ఉజ్జీవనానికి తగిన, ముఖ్యమైన మందు, భక్తులకు మిక్కిలి హితాన్ని కల్గించే మందు, సంసారభయాన్ని పోగొట్టడంలో ప్రముఖమైన మందు, శ్రేయస్సులను పొందించే మందు అయిన శ్రీకృష్ణుడనే దివ్యౌషధాన్ని సేవించు.

**ఆమ్నాయాభ్యసనాన్యరణ్యరుదితం వేదవ్రతాన్యన్వహం**
**మేదశ్ఛేదఫలాని పూర్తవిధయః సర్వే హుతం భస్మని ।**
**తీర్థానామవగాహనాని చ గజస్నానం వినా యత్పద -**
**ద్వంద్వాంభోరుహసంస్మృతీ ర్విజయతే దేవ స్స నారాయణః ॥ 25**

ఏ శ్రీకృష్ణుని శ్రీచరణపద్మయుగంలో చింతన లేకపోతే వేదాధ్యయనాలు అన్నీ అరణ్యరోదనలవలె, వ్యర్థాలు అవుతాయో, ప్రతిదినం చేస్తున్న వేదాలలో చెప్పబడ్డ



ఉపాసనాదివ్రతాలు కేవల మాంసశోషణాన్నే ఫలంగా కల్గినవి (నిరర్థకాలు) అవుతాయో, చెఱువులను తవ్వించడం, సత్రాలను కట్టించడం మొదలైన ధర్మకార్యాలన్నీ బూడిదలో హోమం చేసినట్లుగా నిష్ప్రయోజనాలు అవుతాయో, గంగాది పుణ్యతీర్థాలలోని స్నానాలు ఏనుగు స్నానం చేసినట్లుగా వ్యర్థాలు అవుతాయో, ఆ దేవుడు నారాయణుడు వర్ధిల్లుతున్నాడు.

**శ్రీమన్నామ ప్రోచ్య నారాయణాఖ్యం కే న ప్రాపుర్వాంఛితం పాపినోఽపి।**
**హా! నః పూర్వం వాక్ ప్రవృత్తా న తస్మిన్ తేన ప్రాప్తం గర్భవాసాదిదుఃఖమ్॥ 26**

నారాయణుడనే శ్రియఃపతియొక్క తిరునామాన్ని పల్కి ఏ పాపులు తమ అభీష్టాన్ని పొందలేదు? మన వాక్కు పూర్వమే ఆ నారాయణుని నామోచ్చారణంలో ప్రవర్తించలేదు. అందువల్లనే గర్భవాసం మొదలైన దుఃఖాలు మనకు ప్రాప్తించాయి. అయ్యో!

**మజ్జన్మనః ఫలమిదం మధుకైటభారే! మత్ప్రార్థనీయ మదనుగ్రహ ఏష ఏవ ।**
**త్వద్భృత్యభృత్య పరిచారకభృత్యభృత్య భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ! ॥ 27**

మధుకైటభులనే అసురులను సంహరించిన ఓ స్వామీ! నా జన్మకు ఇదే ఫలం. నాచే ప్రార్థింపబడదగినదై, నా విషయంలో నీవు చేయవలసిన అనుగ్రహం ఇదే. (అది ఏది? అంటే,) ఓ లోకనాథా! నన్ను నీ చరమావధిదాసునిగా మనస్సులో నిలుపుకోవాలి. (అనేదే ఆ అనుగ్రహం.)

**నాథే నః పురుషోత్తమే త్రిజగతా మేకాధిపే చేతసా**
**సేవ్యే స్వస్య పదస్య దాతరి సురే నారాయణే తిష్ఠతి ।**
**యం కంచిత్ పురుషాధమం కతిపయగ్రామేశ మల్పార్థదం**
**సేవాయై మృగయామహే నర మహో! మూకా వరాకా వయమ్ ॥ 28**

పురుషులలో ఉత్తముడు, ముల్లోకాలకు అద్వితీయప్రభువు, మనస్సులో భావించదగినవాడు, తన స్థానం అయిన పరమపదాన్ని అనుగ్రహించేవాడు అయిన శ్రీమన్నారాయణుడనే దేవుడు మనకు నాథుడై ఉండగా, (అతనిని ఆశ్రయించకుండా), కొన్ని గ్రామాలకుమాత్రం అధిపుడై, ఏదో కొద్దిపాటి ధనాన్ని ఇవ్వగలవాడై, పురుషాధముడైన ఎవడో ఒక మానవుని సేవించడంకోసం అన్వేషిస్తున్నామే! అయ్యో! ఎంత ఆశ్చర్యం! ఇటువంటి మనం మూగవారం, ఉపయోగం లేనివారమయ్యామే!

**మదన! పరిహర స్థితిం మదీయే మనసి ముకున్దపదారవిన్దధామ్ని ।**
**హరనయన కృశానునా కృశోఽసి స్మరసి న చక్రపరాక్రమం మురారేః ॥ 29**

ఓ మన్మథా! శ్రీకృష్ణుని శ్రీచరణపద్మాలకు నివాసస్థానమైన నా మనస్సులో ఉండడాన్ని ఇక మానివేయి. శివుని నిటలాక్షంనుండి పుట్టిన అగ్నితో ఇదివరకే నీవు శరీరహీనుడవయ్యావు. మురారి చేతిలోని శ్రీసుదర్శనచక్రపరాక్రమం ఎటువంటిదో నీవు స్మరించడంలేదా! ఏమి!

**తత్త్వం బ్రువాణాని పరం పరస్మాత్ మధు క్షరన్తీవ సతాం ఫలాని ।**
**ప్రావర్తయ ప్రాంజలిరస్మి జిహ్వే! నామాని నారాయణగోచరాణి ॥ 30**

ఓ నాలుకా! ఉన్నతమైనదానికంటే ఉన్నతమైన (చాలా గొప్ప) తత్త్వాన్ని పల్కుతున్నవి, సత్పురుషులకు మధువును స్రవిస్తున్న ఫలాలవంటివి అయిన శ్రీమన్నారాయణుని విషయమైన తిరునామాలను మాటిమాటికి అనుసంధించు. (జపించు). నీవు ఈ విధంగా చేయడంకోసం నీకు చేతులను జోడించి నమస్కరిస్తున్నాను.

**ఇదం శరీరం పరిణామపేశలం పతత్యవశ్యం శ్లథసంధిజర్ఝరమ్ ।**
**కిమౌషధైః క్లిశ్యసి మూఢ! దుర్మతే! నిరామయం కృష్ణరసాయనం పిబ॥ 31**

ఈ శరీరం దినాలు గడచేకొలది పరిణామాన్ని పొందుతుంది. సడలిన సంధి బంధాలను కల్గినదై, శిథిలమై, తప్పక ఏదో ఒకనాడు నశించబోతుంది. ఓ మూఢుడా! దుర్బుద్ధిని కలవాడా! ఓషధాలతో ఎందుకు బాధపడతావు? సంసార మనే వ్యాధిని తీర్చే శ్రీకృష్ణుడనే రసాయనాన్ని పానం చేయి.

**దారా వారాకరవరసుతా తే తనూజో విరించిః**
**స్తోతా వేద స్తవ సురగణో భృత్యవర్గః ప్రసాదః ।**
**ముక్తిర్మాయా జగదవికలం తావకీ దేవకీ తే**
**మాతా మిత్రం బలరిపుసుతః త్వయ్యతోఽన్యన్న జానే ॥ 32**

నీ భార్య పాలసముద్రంలో అవతరించిన లక్ష్మీదేవి, నీ కుమారుడు బ్రహ్మ. నిన్ను స్తుతించేవి వేదాలు. నీ సేవకులు దేవతలు. మోక్షం అనేది నీ అనుగ్రహం (ఫలం). సకలలోకం నీ ప్రకృతి (నీమాయ). నీ తల్లి దేవకీదేవి. నీ మిత్రం ఇంద్రసుతుడైన అర్జునుడు. ఇంతకంటే వేఱయిన విషయాలను నీ విషయంగా నేను తెలియను.



**కృష్ణో రక్షతు నో జగత్త్రయగురుః కృష్ణం నమస్యామ్యహం**
**కృష్ణేనామరశత్రవో వినిహతాః కృష్ణాయ తస్మై నమః ।**
**కృష్ణాదేవ సముత్థితం జగదిదం కృష్ణస్య దాసోఽస్మ్యహం**
**కృష్ణే తిష్ఠతి సర్వ మేతదఖిలం హే కృష్ణ! సంరక్ష మామ్ ॥ 33**

ముల్లోకాలకు ప్రభువైన శ్రీకృష్ణుడు మనలను రక్షించుగాక! నేను శ్రీకృష్ణుని నమస్కరిస్తున్నాను. ఏ శ్రీకృష్ణునిచే అసురులు సంహరింపబడ్డారో, ఆ శ్రీకృష్ణునకు నమస్కారం. ఈ జగత్తు శ్రీకృష్ణునివలన ఉత్పన్నమైనది. అందువల్ల నేను శ్రీకృష్ణునునకు దాసుడను. ఈ సమస్తప్రపంచం శ్రీకృష్ణునిలో స్థిరంగా నిలచి ఉన్నది. ఓ శ్రీకృష్ణా! దాసుడనైన నన్ను రక్షించాలి.

**స త్వం ప్రసీద భగవన్! కురు మయ్యనాథే విష్ణో! కృపాం పరమకారుణికః కిల త్వమ్।**
**సంసారసాగరనిమగ్న మనన్తదీనం ఉద్ధర్తుమర్హసి హరే! పురుషోత్తమోఽసి॥ 34**

భగవన్! (షాడ్గుణ్యపూర్ణా!), అంతటా వ్యాపించి ఉండే విష్ణూ! వేద ప్రసిద్ధుడవైన నీవు అనన్యగతిని అయిన నాపై అనుగ్రహాన్ని చూపాలి. ప్రసన్నుడవు కావాలి. భక్తుల దుఃఖాలను తీర్చే హరీ! (ఈ కాలంలో మాత్రమే ఉండేవాడు, ఈ దేశంలో మాత్రమే ఉండేవాడు, ఈ రూపాన్ని మాత్రమే కల్గి ఉండేవాడు - అని నిశ్చయించి చెప్పలేని రీతిలో) త్రివిధపరిచ్ఛేదాలు ఏమీ లేని అనంతా! నీవు గొప్ప కరుణను సహజంగా కలవాడవుకదా! సంసారసముద్రంలో పూర్తిగా మునిగినవాడనై, అటు ఇటు కొట్టుమిట్టాడుతున్న దీనుడవైన నన్ను నీవు ఉద్ధరించాలి. నీవు పురుషులలో ఉత్తముడవు.

**నమామి నారాయణపాదపంకజం కరోమి నారాయణపూజనం సదా।**
**వదామి నారాయణనామ నిర్మలం స్మరామి నారాయణతత్త్వ మవ్యయమ్॥ 35**

శ్రీమన్నారాయణుని శ్రీచరణపద్మాన్ని నమస్కరిస్తున్నాను. శ్రీమన్నారాయణుని పూజను సదా చేస్తున్నాను. దోషరహితమైన శ్రీమన్నారాయణుని నామాన్ని ఉచ్చరిస్తున్నాను. నాశనం లేని (మార్పు లేని) పరతత్త్వమైన శ్రీమన్నారాయణుని గూర్చి చింతిస్తున్నాను.

**శ్రీనాథ! నారాయణ! వాసుదేవ! శ్రీకృష్ణ! భక్తప్రియ! చక్రపాణే! ।**
**శ్రీపద్మనాభాచ్యుత! కైటభారే! శ్రీరామ! పద్మాక్ష! హరే! మురారే! ॥ 36**

**అనన్త! వైకుణ్ఠ! ముకున్ద! కృష్ణ! గోవిన్ద! దామోదర! మాధవేతి!**
**వక్తుం సమర్థోఽపి న వక్తి కశ్చిత్ అహో! జనానాం వ్యసనాభిముఖ్యమ్॥ 37**

లక్ష్మీపతీ! నారాయణా! వాసుదేవా! శ్రీకృష్ణా! భక్తవత్సలా! చక్రపాణీ! శ్రీపద్మనాభా! అచ్యుతా! కైటభుడనే అసురుని సంహరించినవాడా! శ్రీరామా! పుండరీకాక్షా! భక్తుల పాపాలను హరించే శ్రీహరీ! మురుడనే అసురుని వధించిన మురారీ! అనంతా! వైకుంఠా! ముకుందా! కృష్ణా! గోవిందా! దామోదరా! మాధవా! - అని ఈ విధంగా భగవన్నామాలను పల్కడానికి సమర్థుడైనా ఎవడూ వీనిని పల్కడం లేదే. ఈ జనులకు దుఃఖపడడంలోనే ఉండే అభిముఖ్యం అయ్యో! ఎంత ఆశ్చర్యకరమైనది!

**ధ్యాయన్తి యే విష్ణు మనన్త మవ్యయం హృత్పద్మమధ్యే సతతం వ్యవస్థితమ్।**
**సమాహితానాం సతతాభయప్రదం తే యాన్తి సిద్ధిం పరమాం చ వైష్ణవీమ్॥ 38**

హృదయకమలం మధ్యలో ఎల్లప్పుడు వేంచేసి ఉండేవాడు, సమాధిలో ఉండే యోగులకు అన్ని కాలలోను "భయపడవద్దు" అని అభయప్రదానాన్ని చేసేవాడు, ఏనాడూ వ్యయం (మార్పు) లేనివాడు, పరిచ్ఛేదాతీతుడు అయిన శ్రీమహావిష్ణువును ఎవరు ధ్యానిస్తున్నారో వారు గొప్పదైన వైష్ణవ సిద్ధిని పొందుతున్నారు.

**క్షీరసాగరతరఙ్గశీకరాసారతారకితచారుమూర్తయే ।**
**భోగిభోగశయనీయశాయినే మాధవాయ మధువిద్విషే నమః ॥ 39**

క్షీరసాగరంలోని అలల చిఱు తుంపురుల ధారాసంపాతంచేత నక్షత్రాలు చేరినట్లుండే తిరుమేనిని కలవాడు, ఆదిశేషుని శరీరంపై పవళించి ఉండేవాడు, మధువు అనే అసురుని సంహరించినవాడైన మాధవునకు నమస్కారం.

**యస్య ప్రియౌ శ్రుతిధరౌ కవిలోకవీరౌ మిత్రే ద్విజన్మవరపద్మశరావభూతామ్।**
**తేనామ్బుజాక్షచరణామ్బుజషట్పదేన రాజ్ఞా కృతా కృతి రియం కులశేఖరేణ॥ 40**

ఏ కులశేఖరులకు వేదవిదులు, కవులలో గొప్పవారు, బ్రాహ్మణశ్రేష్ఠులు అయిన పద్ముడు, శరుడు - అనే ఇద్దరు ఆప్తమిత్రులో, తామరనేత్రుడైన భగవానుని శ్రీచరణాలలో తుమ్మెదవలె అంతరంగులైన ఆ కులశేఖరులచే ఈ ముకుందమాల అనే స్తుతి రచింపబడింది.

శ్రీ ముకున్దమాలా తాత్పర్యం సంపూర్ణం.

---



శ్రీయామునాచార్యవిరచితమైన

# స్తోత్ర రత్నమ్

**స్వాదయన్నిహ సర్వేషాం త్రయ్యన్తార్థం సుదుర్గ్రహమ్ ।**
**స్తోత్రయామాస యోగీంద్రః తం వన్దే యామునాహ్వయమ్ ॥**

అందఱికి గ్రహించడానికి సాధ్యం కాని మూడు వేదాల అర్థాన్ని ఆస్వాదింపజేస్తూ ఏ యోగీంద్రుడు దానిని స్తోత్రంగా రచించాడో, యామునులనే పేరును కల ఆ యోగీంద్రునకు నమస్కరిస్తున్నాను.

**నమో నమో యామునాయ యామునాయ నమో నమః ।**
**నమో నమో యామునాయ యామునాయ నమో నమః ।**

యామునులకు నమస్కారం; యామునులకు నమస్కారం; యామునులకు నమస్కారం; యామునులకు నమస్కారం.

---

**నమోఽచిన్త్యాద్భుతాక్లిష్టజ్ఞానవైరాగ్యరాశయే ।**
**నాథాయ మునయేఽగాధభగవద్భక్తిసిన్ధవే ॥ 1**

చింతించడానికి సాధ్యం కాని, ఆశ్చర్యకరమైన, ఏ క్లేశం లేని జ్ఞానంయొక్క, వైరాగ్యంయొక్క సమూహం అయినవారు, మిక్కిలి గంభీరమైన భగవద్భక్తికి సముద్రులవంటివారైన నాథమునికి నమస్కారం.

**తస్మై నమో మధుజిదఙ్ఘ్రిసరోజతత్త్వ జ్ఞానానురాగమహిమాతిశయాంతసీమ్నే ।**
**నాథాయ నాథమునయేఽత్ర పరత్ర చాపి నిత్యం యదీయచరణౌ శరణం మదీయమ్ ॥ 2**

మధుసూదనుడైన భగవానుని శ్రీచరణాల విషయమైన తత్త్వజ్ఞానంయొక్క, ఆ శ్రీచరణాలలోని భక్తి మాహాత్మ్యంయొక్క పరమావధి అయినవారు, మన కులనాథులు అయిన ఆ నాథమునులకు నమస్కారం. ఆ నాథమునుల శ్రీపాదపద్మాలే నాకు సదా ఈ లోకంలో, పరలోకంలో ఉపాయం, ప్రాప్యం, రక్షకం కూడా.

**భూయో నమోఽపరిమితాచ్యుతభక్తితత్త్వజ్ఞానామృతాబ్ధిపరివాహశుభైర్వచోభిః ।**
**లోకేఽవతీర్ణపరమార్థసమగ్రభక్తియోగాయ నాథమునయే యమినాం వరాయ ॥ 3**

హద్దు లేని, నాశం లేని విష్ణుభక్తి, తత్త్వజ్ఞానం - అనే అమృతసముద్రాల ప్రవాహాలవంటి శుభప్రదాలైన వాక్కులతో లోకంలో అవతరించిన యథార్థమైన భక్తియోగాన్ని కలవారు, మునులలో శ్రేష్ఠులైన నాథమునులకు నమస్కారం.

**తత్త్వేన యః చిదచిదీశ్వరతత్స్వభావభోగాపవర్గతదుపాయగతీ రుదారః ।**
**సందర్శయన్ నిరమిమీత పురాణరత్నం తస్మై నమో మునివరాయ పరాశరాయ॥ 4**

శ్రీపరాశరమహర్షి చాలా ఉదారమైన స్వభావాన్ని కలవారు. ఆ మహర్షి చిత్తు - అచిత్తు - ఈశ్వరులనే మూడు తత్త్వాల స్వరూప స్వభావాలను, ఇహలోక పరలోక సుఖాద్యనుభవాన్ని, కైవల్యాన్ని, మోక్షప్రాప్తిరూపమైన అపవర్గాన్ని, వాటికి ఉపాయాలైన ధర్మాలను, దాని స్వరూపస్వభావాలను, ఈ ఉపాయాలకు సంబంధించిన సాత్త్విక రాజసతామసరూపాలైన గతులను యథాతథంగా దర్శింపజేస్తూ పురాణరత్న మనబడే విష్ణుపురాణాన్ని నిర్మించారు. మునివరులలో గొప్పవారైన ఈ పరాశర మహర్షికి నమస్కారం'.

**మాతా పితా యువతయ స్తనయా విభూతిః సర్వం యదేవ నియమేన మదన్వయానామ్।**
**ఆద్యస్య నః కులపతేః వకుళాభిరామం శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా॥ 5**

(విద్యచేత, జన్మచేత) నా వంశానికి చెందినవారికి శ్రీశఠకోపుల శ్రీచరణయుగమే ఎల్లప్పుడు తల్లి, తండ్రి, భార్య, తనయులు, సంపద, వీటికంటే మిగిలిన ఇహలోక పరలోకపురుషార్థాలు, వీటికి సాధనంగా చెప్పబడేవి అన్నీ అవుతున్నవి. నాథమునుల సంప్రదాయానికి చెందిన మా కులానికి మొదటివారైన శ్రీ శఠకోపుల ప్రకాశించే ఆ శ్రీచరణయుగళాన్ని శిరసా నమస్కరిస్తున్నాను.

**యన్మూర్ధ్ని మే శ్రుతిశిరస్సు చ భాతి యస్మిన్ అస్మన్మనోరథపథ స్సకల స్సమేతి ।**
**స్తోష్యామి నః కులధనం కులదైవతం తత్ పాదారవిన్ద మరవిన్దవిలోచనస్య ॥ 6**

పరత్వానికి, సౌలభ్యానికి పరమావధిగా ప్రసిద్ధి చెందిన, అరవిందలోచనుడైన శ్రీమన్నారాయణుని పాదారవిందాలను స్తుతిస్తున్నాను. ఆ పాదారవిందాలు సర్వశాస్త్ర ప్రసిద్ధమైనవి. నా శిరస్సుపైన, ఉపనిషత్ శిరస్సులపైన ప్రకాశిస్తున్నాయి. నాయొక్క, మా వంశానికి చెందినవారియొక్క మనోరథానికి అవి గమ్యస్థానం. మా కులధనం, మా కులదైవం.

**తత్త్వేన యస్య మహిమార్ణవశీకరాణుః శక్యో న మాతు మపి శర్వపితామహాద్యైః।**
**కర్తుం తదీయమహిమస్తుతి ముద్యతాయ మహ్యం నమోఽస్తు కవయే నిరపత్రపాయ॥ 7**



శ్రీమన్నారాయణుని మహిమ అనే సముద్రంలోని నీటితుంపురులలోని అణుభాగాన్ని అయినా శివుడు, బ్రహ్మ మొదలైనవారుసైతం యథాతథంగా వాక్కుతో గాని మనస్సుతోగాని ఇంతటిది అని పూర్తిగా కొలువడానికి సమర్థులు కారు. అటువంటి స్వామి మహిమను స్తుతించడానికి ఉద్యమించినవాడను, అందువల్లనే సిగ్గు లేనివాడను, మహాకవులకు వచ్చే కీర్తి నాకుకూడా కలగాలని కోరుకొనేవాడను, మహాయోగులకు సైతం వీలుకాని పనిని చేయడంకోసం ప్రయత్నించేవాడనైన నాకు (నేనే) నమస్కారం చెప్పుకోవాలి.

**యద్వా శ్రమావధి యథామతి వాఽప్యశక్తః స్తౌమ్యేవమేవ ఖలు తేఽపి సదా స్తువన్తః ।**
**వేదా శ్చతుర్ముఖముఖాశ్చ మహార్ణవాన్తః కో మజ్జతో రణుకులాచలయోర్విశేషః ॥ 8**

ఆవిధంగా కాకపోతే, బ్రహ్మాదులవలె స్తుతించడంలో శక్తి లేకపోయినప్పటికీ, శ్రమ కలిగేంతవరకు గాని, నా బుద్ధికి తోచినట్లుగాగాని స్తుతిస్తాను. గొప్ప జ్ఞాన శక్తులను కల్గినవిగా ప్రసిద్ధాలైన వేదాలు సైతం ఎల్లప్పుడు భగవానుని మహిమను స్తుతిస్తున్నా, అవి భగవన్మహిమను పూర్తిగా స్తుతించలేకపోతున్నాయికదా! పరమాణువు అయినా, పర్వతమైనా మహాసముద్రంలోపల మునిగిపోవడంలో సమానమేకదా! ఆ విధంగా, గొప్పవైన వేదాలు అయినా, చాలా అల్పుడనైన నేనైనా భగవానుని మహిమను స్తుతించలేకపోవడంలో సమానులమే కనుక, వేదాలు యథాశక్తి స్తుతించినట్లే నేనుకూడా నా శక్తి మేరకు స్తుతిస్తాను.

**కించైష శక్త్యతిశయేన న తేఽనుకమ్ప్యః స్తోతాఽపి తు స్తుతికృతేన పరిశ్రమేణ।**
**తత్ర శ్రమస్తు సులభో మమ మన్దబుద్ధేః ఇత్యుద్యమోఽయముచితో మమ చాబ్జనేత్ర!॥ 9**

తామరపూవులవంటి నేత్రాలను కల స్వామీ! అంతేకాక, నిన్ను స్తుతించాలని ప్రయత్నించే ఈ దాసుడు (నేను) శక్తియొక్క ఆధిక్యంచేత దయ తలచదగినవాడు కాడు. (నా శక్త్యతిశయాన్ని చూచి నీవు దయచూపవలసిన పనిలేదు). కాని, స్తుతించడంలో నేను పడే శ్రమను చూచే నన్ను నీవు దయతలచాలి. స్తుతించడంలో మందబుద్ధి అయిన నాకు శ్రమ కల్గడం సులభం అనే కారణంవల్లకూడా నాకు ఈ ప్రయత్నం తగినదే సుమా! (నా శ్రమను చూచి నీవు నన్ను తప్పక కరుణిస్తావు కదా! నీ కరుణకు కారణం అవుతుంది కనుక నేను నిన్ను స్తుతించడం తగినదే)

**నావేక్షసే యది తతో భువనాన్యమూని నాలం ప్రభో! భవితు మేవ కుతః ప్రవృత్తిః ।**
**ఏవం నిసర్గసుహృది త్వయి సర్వజన్తోః స్వామిన్! న చిత్ర మిద మాశ్రితవత్సలత్వమ్ ॥ 10**

ప్రభూ! నీవు త్రివిధచేతనాచేతనాల స్వరూపస్థితి ప్రవృత్తులను అన్నిటిని నీ అధీనంలో కలవాడవు. సర్వస్వామివి. నీవు కటాక్షించకపోతే ఈ లోకాల ఉత్పత్తి సైతం సంభవించదు. ఇక వాని ప్రవృత్తిమాట ఎందుకు? ఈ విధంగా ప్రాణు లన్నిటికి సహజసుహృత్తు అయిన నీవు ఆశ్రితవాత్సల్యాన్ని కల్గి ఉండడంలో ఆశ్చర్యం లేదు సుమా!

**స్వాభావికానవధికాతిశయేశితృత్వం నారాయణ! త్వయి న మృష్యతి వైదికః కః ।**
**బ్రహ్మా శివ శ్శతమఖః పరమస్స్వరాడితి ఏతేఽపి యస్య మహిమార్ణవవిప్రుషస్తే ॥ 11**

శ్రీమన్నారాయణా! సర్వవేదవేద్యుడవు, సకలకారణభూతుడవు, సర్వస్వామివిగా ప్రసిద్ధుడవైన నీవు సహజమైన, అవధి లేని ఉత్కర్షను కల స్వామిత్వాన్ని కలవాడవని వేదాలను ప్రమాణంగా అంగీకరించే ఏ వైదికుడు అంగీకరించడు? బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు, ముక్తపురుషులు - అనే వీరంతా నీ మహిమ అనే మహాసముద్రంలోని చిన్ని చిన్ని నీటితునకలు మాత్రమేసుమా!

**కః శ్రీః శ్రియః పరమసత్త్వసమాశ్రయః కః కః పుణ్డరీకనయనః పురుషోత్తమః కః ।**
**కస్యాయుతాయుతశతైకకలాంశకాంశే విశ్వం విచిత్రచిదచిత్ ప్రవిభాగవృత్తమ్ ॥ 12**

లక్ష్మీదేవికే లక్ష్మి అయినవాడు నీకంటే ఇంకెవరు? గొప్ప సత్త్వగుణానికి ఆశ్రయం నీకంటే ఇంకెవరు? పుండరీకాక్షుడు నీకంటే ఇంకెవరు? పురుషోత్తముడు నీకంటే ఇంకెవరు? అనేకకోట్ల సంఖ్యలో ఉండే నీ భాగాలలోని ఒక అంశలో ఈ సమస్త మైన విశ్వం విచిత్రమైన చిదచిదాత్మకవిభాగంతో ప్రవర్తిస్తున్నది. ఇంతటి మహిమను కలవాడవు నీవు.

**వేదాపహారగురుపాతక దైత్యపీడాద్యాపద్విమోచన మహిష్ఠఫలప్రదానైః ।**
**కోఽన్యః ప్రజాపశుపతీ పరిపాతి కస్య పాదోదకేన స శివ స్స్వశిరోధృతేన ॥ 13**

వేదాలను అపహరించిన మధుకైటభాదులను సంహరించడం, తన తండ్రి అయిన బ్రహ్మ శిరస్సును ఖండించడంవల్ల కల్గిన బ్రహ్మహత్యాపాతకంనుండి (శివుని) విడిపించడం, దైత్యులవల్ల కల్గిన పీడనుండి (ఇంద్రునకు) విముక్తిని కల్గించడం - మొదలైన గొప్ప ప్రయోజనాలను కల్గించడంద్వారా నీకంటే ఇంకెవరు (క్రమంగా) బ్రహ్మ, రుద్ర, ఇంద్రులను రక్షించారు? నీపాదాలనుండి పుట్టిన గంగా జలాన్ని తన శిరస్సుపై ధరించిన శివుడు శివశబ్దవాచ్యుడు (పవిత్రుడు) అయ్యాడు.



**కస్యోదరే హరవిరించిముఖః ప్రపంచః కో రక్షతీమ మజనిష్ట చ కస్య నాభేః ।**
**క్రాన్త్వా నిగీర్య పునరుద్గిరతి త్వదన్యః కః కేన వైష పరవానితి శక్యశంకః ॥ 14**

బ్రహ్మ, రుద్రుడు మొదలైన ఈ సమస్తప్రపంచం నీ ఉదరంలోనే ఇమిడి ఉన్నది. ఈ ప్రపంచాన్ని నీవే రక్షిస్తున్నావు. నీ నాభిపద్మంనుండి ఈ ప్రపంచం అంతా పుట్టింది. నీవే త్రివిక్రముడవై ఈ ప్రపంచాన్ని అంతటిని కొలిచావు. ప్రళయకాలంలో నీ గర్భంలో దాచుకొని మళ్ళీ సృష్టికాలంలో బయలుపరుస్తున్నావు. ఈ విధంగా అందఱికి ఆధారంగా, నియంతగా, శేషిగా ఉండే నీవల్ల ఈ ప్రపంచం సర్వాతిశాయి అయిన స్వామిని కల్గినదిగా ఊహింపదగినదై ఉన్నది.

**త్వాం శీలరూపచరితైః పరమప్రకృష్టసత్త్వేన సాత్త్వికతయా ప్రబలైశ్చ శాస్త్రైః ।**
**ప్రఖ్యాతదైవపరమార్థవిదాం మతైశ్చ నైవాసురప్రకృతయః ప్రభవన్తి బోద్ధుమ్ ॥ 15**

పూర్వం పేర్కొన్న విధంగా గొప్పవారందఱికంటే గొప్పవాడైన నిన్ను నీ శీల గుణంతో, నీ అద్భుతరూపంతో, నీ ఆశ్చర్యకరచరిత్రలతో, మిక్కిలి ఉత్కృష్టమైన సత్త్వ గుణంతో, అత్యంతం సాత్త్వికాలుగా ప్రసిద్ధి చెందిన శాస్త్రాలతో, ప్రసిద్ధి చెందిన పరదైవంయొక్క తత్త్వాన్ని యతాతథంగా గ్రహించిన మహర్షులు, ఆళ్వార్లవంటి వారి మతాలతో తెలిసికోవడం వీలయినా, తామసప్రకృతిని కలవారు నిన్ను తెలిసి కోవడంలో అసమర్థులే అవుతున్నారు.

**ఉల్లంఘితత్రివిధసీమసమాతిశాయి సమ్భావనం తవ పరిబ్రఢిమస్వభావమ్ ।**
**మాయాబలేన భవతాఽపి నిగుహ్యమానం పశ్యన్తి కేచిదనిశం త్వదనన్యభావాః ॥ 16**

దేశ - కాల - వస్తు పరిచ్ఛేదాలనే త్రివిధాలైన హద్దులను దాటినది, సారూప్యాన్ని గాని, ఆధిక్యాన్ని కాని కల్గినవారెవరూ లేరు - అని భావింపబడేది అయిన పరత్వ రూపమైన నీ స్వభావం త్రిగుణాత్మక అయిన మాయయొక్క సామర్థ్యంతో కప్పి పుచ్చబడినా, త్వదేకమనస్కులైన మహాత్ములు కొందఱు నీ అనుగ్రహంవల్ల నిన్ను సదా దర్శిస్తున్నారు.

**యదణ్డ మణ్డాన్తరగోచరం చ యత్ దశోత్తరాణ్యావరణాని యాని చ ।**
**గుణాః ప్రధానం పురుషః పరమ్పదం పరాత్పరం బ్రహ్మ చ తే విభూతయః ॥ 17**

చతుర్దశభువనాల రూపంలో ఉండే ఈ బ్రహ్మాండం, బ్రహ్మాండం మధ్యలో కన్పించే జీవరాసులు, ఒకదానిని ఇంకొకటి పది రెట్లుగా ఉండే జలం, అగ్ని, వాయువు, ఆకాశం, భూతాలు, మహత్తు మొదలైన ఏడు ఆవరణాలు, సత్త్వరజస్తమో గుణాలు, ప్రకృతి క్షేత్రజ్ఞపురుష సముదాయం, పునరావృత్తి లేని, అప్రాకృతమైన,

శాశ్వతమైన పరమపదం, ప్రకృతికంటే క్షేత్రజ్ఞునికంటే, ముక్తునికంటే పరమైన భగవానుని దివ్యమంగళ విగ్రహం, దివ్యభూషణాలు, ఆయుధాదులు - ఇవి అన్నీ నీ విభూతులే. నీకు శేషభూతాలే. నీ సంకల్పానికి అధీనాలే.

**వశీ వదాన్యో గుణవాన్ ఋజు శ్శుచిః మృదుర్దయాలు ర్మధుర స్థిర స్సమః ।**
**కృతీ కృతజ్ఞస్త్వమసి స్వభావతః సమస్తకల్యాణగుణామృతోదధిః ॥ 18**

భక్తులకు అధీనంలో ఉండేవాడవు, దానశీలుడవు, సౌశీల్యమనే గుణాన్ని కలవాడవు, మనోవాక్కాయాలలో ఒకేవిధంగా ప్రవర్తించే ఋజుత్వాన్ని కలవాడవు, భావశుద్ధిని కల పవిత్రుడవు, అపరాధాలను చేసినవారు సైతం ఆశ్రయించడానికి సాధ్యమైన మృదుత్వాన్ని కలవాడవు, దయను కలవాడవు, ఆనందస్వరూపుడవు, స్థిరమైన మనస్సును కలవాడవు, అందఱి విషయంలో సమంగా ప్రవర్తించేవాడవు, కృతకృత్యుడవు, ఇతరులు చేసిన ఉపకారాలను (జీవులు చేసిన పుణ్యాలను) స్మరించేవాడవు. నీవు సహజంగానే సమస్తకల్యాణగుణాలు అనే అమృతప్రవాహానికి సముద్రంవంటివాడవు.

**ఉపర్యుపర్యబ్జభువోఽపి పూరుషాన్ ప్రకల్ప్య తే యే శతమిత్యనుక్రమాత్ ।**
**గిరస్త్వదేకైకగుణావధీప్సయా సదా స్థితా నోద్యమతోఽతి శేరతే ॥ 19**

వేదాలు (ఆనందవల్లిలో) బ్రహ్మకంటే పైపైన పురుషులను కల్పించి, ఒకని (ఆనంద) గుణంకంటే ఇంకొకని (ఆనంద) గుణం వందరెట్లు అధికమనే క్రమంలో నీ (ఆనంద) గుణాల అవధిని పొందాలనే (చూడాలనే) ఆశతో ఈ నాటికీ ప్రయత్నిస్తూ ఉన్నా, అవి ఆ విధంగా అవధిని చూడలేనివై, ఇంకా ఇంకా ప్రయత్నిస్తూనే ఉన్నాయి.

**త్వదాశ్రితానాం జగదుద్భవస్థితిప్రణాశ సంసారవిమోచనాదయః ।**
**భవన్తి లీలావిధయశ్చ వైదికాః త్వదీయగమ్భీరమనోఽనుసారిణః ॥ 20**

నిన్ను ఆశ్రయించిన భక్తులకు (ముక్తపురుషులకు, బ్రహ్మాదులకు) జగత్తుయొక్క సృష్టి స్థితి లయాలు, సంసారవిమోచనరూప మోక్షప్రాప్తి మొదలైనవి అన్నీ లీలలే. వారుకూడా ఆయా కార్యాలను అవలీలగా నిర్వహించడంలో శక్తులే. దానికి నీ గుణానుభవమే కారణం. వేదంలో విధింపబడ్డ విధులుకూడా నీ భక్తులయొక్క గంభీరమైన మనస్సులను అనుసరించి ప్రవర్తిస్తాయి.

**నమో నమో వాఙ్మనసాతిభూమయే నమో నమో వాఙ్మనసైకభూమయే ।**
**నమో నమోఽనన్తమహావిభూతయే నమో నమోఽనన్తదయైకసిన్ధవే ॥ 21**



స్వప్రయత్నంతో తెలిసికోవాలని ప్రయత్నించేవారి వాక్కుకు, మనస్సుకు అందని గొప్పతనం కల నీకు నమస్కారం. (నీ అనుగ్రహం పొందినవారి) వాక్కుకు, మనస్సుకు మాత్రమే అందే గొప్పతనం కల నీకు నమస్కారం. అంతు లేని గొప్ప ఐశ్వర్యాన్ని కల నీకు నమస్కారం. అంతు లేని దయకు స్థానమైన ఏకైకసముద్రం వంటివాడవైన నీకు నమస్కారం.

**న ధర్మనిష్ఠోఽస్మి న చాత్మవేదీ న భక్తిమాం స్త్వచ్చరణారవిన్దే ।**
**అకిఞ్చనోఽనన్యగతి శ్శరణ్య! త్వత్పాదమూలం శరణం ప్రపద్యే ॥ 22**

నేను ధర్మంలో నిష్ఠను కలవాడను కాను, ఆత్మజ్ఞానాన్ని కలవాడను కాను. నీ చరణపద్మాలలో భక్తిని కలవాడను కాను. ఆశ్రితులను రక్షించడంలో సమర్థుడవు, గొప్ప కరుణను కలవాడవైన ఓ స్వామీ! అంకిచనుడనైన నేను నీ పాదాల మ్రోల శరణు పొందుతున్నాను.

**న నిన్దితం కర్మ తదస్తి లోకే సహస్రశో యన్న మయా వ్యధాయి ।**
**సోఽహం విపాకావసరే ముకున్ద! క్రన్దామి సమ్ప్రత్యగతి స్తవాగ్రే ॥ 23**

మోక్షాన్ని అనుగ్రహించే ఓ ముకుందా! శాస్త్రాలలో ఏయే కర్మలు చేయరానివిగా నిషేధింపబడ్డాయో వాటిని నేను వేలాదిమార్లు చేశాను. ఇక, నాచేత వేలాదిసార్లు చేయబడని పాపకృత్యం అనేది లేనే లేదు. ఆ పాపాలను అన్నిటిని అనుభవించే సమయం అయిన ఇపుడు వేఱు దిక్కు లేనివాడనై నీ సమక్షంలో ఆక్రందిస్తున్నాను.

**నిమజ్జతోఽనన్తభవార్ణవాన్తః చిరాయ మే కూలమివాసి లబ్ధః ।**
**త్వయాఽపి లబ్ధం భగవన్నిదానీమ్ అనుత్తమం పాత్ర మిదం దయాయాః ॥ 24**

అనంతాలైన స్వరూపరూపగుణవిభూత్యాదులను కల అనంతా! సంసారమనే సముద్రంమధ్యలో మునుగుతున్న నాకు చాలా కాలానికి ఒడ్డువలె నీవు లభించావు. భగవన్! నీకుకూడా నీ దయకు గొప్పదైన అర్హత కల్గినవాడనైన నేను ఇంతకాలానికి దొరికాను. నన్ను వదలి పెట్టకు. నావల్లనే నీ దయాగుణం సార్థకం కాగలదు.

**అభూతపూర్వం మమ భావి కిం వా సర్వం సహే మే సహజం హి దుఃఖమ్ ।**
**కిం తు త్వదగ్రే శరణాగతానాం పరాభవో నాథ! న తేఽనురూపః ॥ 25**

నాథా! ఇంతకుముందు నేను అనుభవించనిది, ఇక అనుభవించబోయేది ఏది అయినా దానిని నేను సహిస్తాను. నాకు దుఃఖాలను అనుభవించడం సహజమే

కదా! కాని, శరణ్యుడవైన నీ ఎదుటనే నిన్ను శరణుపొందినవారికి పరాభవం కల్గడం మాత్రం నీకు తగినది కాదు సుమా!

**నిరాసకస్యాపి న తావదుత్సహే మహేశ! హాతుం తవ పాద పంకజమ్ ।**
**రుషా నిరస్తోఽపి శిశుః స్తనన్ధయో న జాతు మాతు శ్చరణౌ జిహాసతి ॥ 26**

ఓ సర్వేశ్వరా! నీవు నన్ను పక్కకు తోసివేసినా నీపాదపద్మాలను వీడిపోవడానికి నేను ఎంతమాత్రం ఇష్టపడను. పాలు తాగే తన శిశువును తల్లి కోపంతో పక్కకు గెంటివేసినా ఆ శిశువు తనతల్లి పాదాలను వదలిపోవాలని ఎప్పటికీ అనుకోదుకదా!

**తవామృతస్యన్దిని పాదపఙ్కజే నివేశితాత్మా కథ మన్యదిచ్ఛతి ।**
**స్థితేఽరవిన్దే మకరన్దనిర్భరే మధువ్రతో నేక్షురకం హి వీక్షతే ॥ 27**

అమృతాన్ని చిందించే నీ శ్రీచరణపద్మాలలో స్థిరంగా నిలుపబడిన మనస్సును కలవాడు అసారమైన ఇంకొక వస్తువును దేనిని ఆశిస్తాడు? మకరందంతో నిండైన పద్మంలో ఉండే తుమ్మెద సారహీనమైన గొబ్బిపువ్వును కన్నెత్తికూడా చూడదుకదా!

**త్వదంఘ్రి ముద్దిశ్య కదాపి కేనచిత్ యథా తథా వాఽపి సకృత్కృతోఽఞ్జలిః ।**
**తదైవ ముష్ణాత్యశుభాన్యశేషతః శుభాని పుష్ణాతి న జాతు హీయతే ॥ 28**

నీ శ్రీచరణపద్మాలను ఉద్దేశించి ఎపుడైనా, ఎవనిచే అయినా, ఏవిధంగా అయినా ఒక్కమారు చేయబడిన అంజలి అపుడే, ఆ క్షణమే అమంగళాలను పూర్తిగా హరిస్తుంది. అది (మిగిలిన పుణ్యకర్మలవలె ఫలాన్ని ఇచ్చిన తరువాత నశించేటట్లు నశించదు) ఎప్పటికీ నిలచి ఉంటుంది.

**ఉదీర్ణసంసారదవాశుశుక్షణిం క్షణేన నిర్వాప్య పరాఞ్చ నిర్వృతిమ్ ।**
**ప్రయచ్ఛతి త్వచ్చరణారుణామ్బుజ ద్వయానురాగామృతసిన్ధుశీకరః ॥ 29**

నీ ఎఱ్ఱని శ్రీపదపద్మాల జంట విషయంలో ఉండే భక్తి అనే అమృతసముద్రం యొక్క తుంపర (చిన్నికణం) భగభగమండే సంసారమనే దావాగ్నిని క్షణకాలంలో శమింపజేసి, గొప్ప ఆనందాన్నికూడా ఇస్తుంది.

**విలాసవిక్రాన్త పరావరాలయం నమస్యదార్తిక్షపణే కృతక్షణమ్ ।**
**ధనం మదీయం తవ పాదపంకజం కదా ను సాక్షాత్కరవాణి చక్షుషా ॥ 30**

దేవా! నీ శ్రీచరణపంకజం, నా కులధనం అయిన శ్రీచరణం అవలీలగా పృథివి మొదలు బ్రహ్మలోకంవరకు ఉండే అన్ని లోకాలను ఆక్రమించింది. తనకు నమస్కరించే భక్తుల ఆర్తిని తీర్చడంలో ఎల్లప్పుడు అది సిద్ధమై ఉంటుంది. అటువంటి నీ చరణాన్ని నా నేత్రాలతో ఎపుడు దర్శిస్తానో!



**కదా పున శ్శంఖరథాంగకల్పక ధ్వజారవిందాంకుశవజ్రలాంఛనమ్ ।**
**త్రివిక్రమ! త్వచ్చరణామ్బుజద్వయం మదీయమూర్ధాన మలంకరిష్యతి ॥ 31**

మూడు అడుగులతో లోకాలను విక్రమించిన ఓ త్రివిక్రమా! శంఖం, చక్రం, కల్పకం, ధ్వజం, పద్మం, అంకుశం, వజ్రం - అనే వీటి చిహ్నాలను కల్గిన నీ శ్రీచరణ ద్వయం నా శిరస్సును ఎపుడు అలంకరిస్తుందోకదా!

**విరాజమానోజ్జ్వలపీతవాససం స్మితాతసీసూనసమామలచ్ఛవిమ్ ।**
**నిమగ్ననాభిం తనుమధ్య మున్నతం విశాలవక్షస్థలశోభిలక్షణమ్ ॥ 32**

ప్రకాశించే గొప్ప పీతాంబరాన్ని కల్గినవాడవు, వికసించిన అతసీసుమాల కాంతివంటి స్వచ్ఛమైన కాంతి కల్గినవాడవు, లోతైన నాభిని కలవాడవు, సన్నని నడుమును కలవాడవు, మిక్కిలి ఎత్తైనవాడవు, విశాలమైన వక్షఃస్థలంలో శోభిల్లే పుట్టుమచ్చను కలవాడవు అయిన నిన్నెపుడు సేవించి నిన్ను సంతోషింపజేస్తానో! (46వ శ్లోకంలోని "**ప్రహర్షయిష్యామి సనాథజీవితః**" అనే ప్రయోగంతో 32వ శ్లోకం నుండి ఉండే అన్ని శ్లోకాలు అన్వయిస్తాయి.)

**చకాసతం జ్యాకిణకర్కశై శ్శుభైః చతుర్భి రాజానువిలమ్బిభి ర్భుజైః ।**
**ప్రియావతంసోత్పలకర్ణభూషణ శ్లథాలకాబన్ధవిమర్దశంసిభిః ॥ 33**

మోకాళ్లవరకు వేలాడుతున్నవి, వింటినారిదెబ్బలచే కాయలు కాచి కఠినంగా ఉన్నవి,ప్రియురాలైన లక్ష్మీదేవియొక్క అలంకారాలైన నల్లకలువలు, కర్ణభూషణాలు, విడివడిన సిగముడి - అనే వీటియొక్క రాపిడిని సూచించేవి, శుభ ప్రదాలు అయిన నాల్గు భుజాలతో ప్రకాశించేవాడవైన నిన్నెపుడు సేవించి సంతోషింపజేస్తానో?

**ఉదగ్రపీనాంస విలంబికుణ్డలాలకావళీ బంధురకంబుకంధరమ్ ।**
**ముఖశ్రియా న్యక్కృతపూర్ణనిర్మలాఽమృతాంశుబింబాంబురుహోజ్జ్వలశ్రియమ్ ॥ 34**

మిక్కిలి ఉన్నతాలైన, బాగా బలిష్ఠాలైన, మూపులవరకు వేలాడుతున్న కుండలాలతో, కేశపాశసౌందర్యంతో అందమైన, శంఖంతో సాటి వచ్చే కంఠప్రదేశాన్ని కలవాడవు, ముఖకాంతితో పూర్ణమైన, స్వచ్ఛమైన చంద్రబింబంయొక్క, పద్మం యొక్క కాంతిని మించిన కాంతిని కలవాడవు అయిన నిన్నెపుడు సేవించి సంతోషింప జేస్తానో!

**ప్రబుద్ధముగ్ధామ్బుజ చారులోచనం సవిభ్రమభ్రూలతముజ్జ్వలాధరమ్ ।**
**శుచిస్మితం కోమలగండ మున్నసం లలాటపర్యంతవిలమ్బితాలకమ్ ॥ 35**

వికసించిన, మనోహరమైన పద్మంవలె అందమైన లోచనాలను కలవాడవు, విలాసాలతోకూడిన కనుబొమలను కలవాడవు, ఎఱ్ఱగా ప్రకాశించే అధరాన్ని కలవాడవు, స్వచ్ఛమైన చిఱునవ్వును కలవాడవు, సుకుమారమైన చెక్కిళ్ళను కలవాడవు, ఎత్తైన నాసికను కలవాడవు, నుదుటివరకు వేలాడే ముంగురులను కలవాడవైన నిన్ను సేవించి ఎపుడు సంతోషపెడతాను?

**స్ఫురత్ కిరీటాంగదహారకణ్ఠికా మణీంద్రకాంచీగుణనూపురాదిభిః ।**
**రథాంగశంఖాసి గదాధనుర్వరైః లసత్తులస్యా వనమాలయోజ్జ్వలమ్ ॥ 36**

ప్రకాశించే కిరీటం, కేయూరాలు, హారాలు, కంఠాభరణాలు, మొలనూలు, నూపురాలు - మొదలైన ఆభరణాలతోను, శ్రీ సుదర్శనం, పాంచజన్యం, నందకం, కౌమోదకి, శార్ఙ్గం - అనే పంచాయుధాలతోను ప్రకాశించే తులసీమాలతో వెలిగే నిన్ను ఎపుడు సేవించి సంతోషపెట్టగలను?

**చకర్థ యస్యా భవనం భుజాన్తరం తవ ప్రియం ధామ యదీయ జన్మభూః ।**
**జగత్సమస్తం యదపాంగసంశ్రయం యదర్థ మమ్భోధి రమన్థబన్ధి చ ॥ 37**

నీ వక్షఃస్థలాన్ని లక్ష్మీదేవికి నివాసస్థానంగా చేశావు. లక్ష్మీదేవియొక్క పుట్టినిల్లు అయిన పాలసముద్రం నీకు ప్రియమైన నివాసం. సమస్తజగత్తు ఆ లక్ష్మీదేవి కటాక్షానికే అధీనమై ఉన్నది. ఆ లక్ష్మీదేవికోసమే సముద్రాన్ని మథించావు, దానికి వారధి కట్టావు. ఇటువంటి లక్ష్మీదేవితో కలసి వేంచేసి ఉండే నిన్ను సేవించి ఎపుడు సంతోషపెట్టగలను?

**స్వవైశ్వరూప్యేణ సదాఽనుభూతయాఽపి అపూర్వవద్విస్మయ మాదధానయా ।**
**గుణేన రూపేణ విలాసచేష్టితైః సదా తవైవోచితయా తవ శ్రియా ॥ 38**

నీ విశ్వరూపాకారంతో సదా అనుభవించినా ఎప్పటికప్పుడు కొత్తదానివలె విస్మయాన్ని కల్గించేది, గుణాలతో, రూపంతో, విలాసాలతో, అవతారాలతో పరవ్యూహ విభవ అర్చాది సర్వరూపాలలో నీకే ఉచితమైన రూపంలో నిన్ను విడువకుండా ఉండి, నీకే శోభను కల్గించేది అయిన లక్ష్మీదేవితో కలసి ఉండే నిన్ను సేవించి ఎపుడు సంతోషపెట్టగలను?



**తయా సహాసీన మనన్తభోగిని ప్రకృష్టవిజ్ఞానబలైకధామని ।**
**ఫణామణివ్రాతమయూఖమణ్డల ప్రకాశమానోదరదివ్యధామని ॥ 39**

గొప్పదైన విజ్ఞానం, బలం - అనే వీనికి అద్వితీయమైన ఆశ్రయమైనవాడు, పడగలలోని మణుల సముదాయంతో తన ఉదరమధ్యభాగాన్ని, దివ్యధామ మనబడే వైకుంఠాన్ని ప్రకాశింపజేసేవాడైన ఆదిశేషునిపై (పూర్వం తెల్పిన వైభవాన్ని కల్గిన) ఆ లక్ష్మీదేవితోకూడి వేంచేసి ఉండే నిన్ను సేవించి ఎపుడు సంతోషింపజేస్తాను?

**నివాసశయ్యాసన పాదుకాంశుకోపధానవర్షాతపవారణాదిభిః ।**
**శరీరభేదై స్తవ శేషతాం గతైః యథోచితం శేష ఇతీరితే జనైః ॥ 40**

నివాసం, శయ్య, దివ్యసింహాసనం, పాదుకలు, పీతాంబరం, తలదిండు, గొడుగు మొదలైన ఆకారాలతో, ఇంకా నీకు శేషత్వాన్ని పొందిన శరీరవిశేషాలతో యథోచితంగా సేవిస్తూ, శేషుడని వ్యవహరింపబడే ఆదిశేషునిపై లక్ష్మీదేవితో కూర్చుని ఉండే నిన్ను సేవించి ఎపుడు సంతోషపెట్టగలను?

**దాసస్సఖా వాహన మాసనం ధ్వజో యస్తే వితానం వ్యజనం త్రయీమయః ।**
**ఉపస్థితం తేన పురో గరుత్మతా త్వదంఘ్రిసమ్మర్దకిణాంకశోభినా ॥ 41**

వేదస్వరూపుడైన గరుత్మంతుడు నీకు దాసుడు, స్నేహితుడు. వాహనంగా, సింహాసనంగా, ధ్వజంగా, వితానంగా, వ్యజనంగా మారి సేవిస్తున్నాడు. నీ శ్రీచరణ సమ్మర్దంచేత ఏర్పడిన కాయలతో అతడు ప్రకాశిస్తున్నాడు. అటువంటి గరుత్మంతుడు ఎదురుగా ఉండి సేవించే నిన్ను ఎపుడు దర్శించి సంతోషపెట్టగలను?

**త్వదీయభుక్తోజ్ఝిత శేషభోజినా త్వయా నిసృష్టాత్మభరేణ యద్యథా ।**
**ప్రియేణ సేనాపతినా న్యవేది తత్ తథాఽనుజానన్త ముదారవీక్షణైః ॥ 42**

నీవు భుజించి విడచిన శేషప్రసాదాన్ని భుజించేవారు, నీచేతనే ఇవ్వబడిన జగన్నిర్వహణాధికారాన్ని కలవాడు, నీకు మిక్కిలి ఇష్టుడు అయిన సేనాపతి (విష్వక్సేనుడు) నివేదించినదానిని యథాతథంగా నీ గంభీరాలైన కటాక్షాలతో అనుమతించే నిన్ను సేవించి ఎపుడు సంతోషపెట్టగలను?

**హతాఖిలక్లేశమలై స్స్వభావతః త్వదానుకూల్యైకరసై స్తవోచితైః ।**
**గృహీతతత్తత్పరిచారసాధనైః నిషేవ్యమాణం సచివై ర్యథోచితమ్ ॥ 43**

సహజంగానే సమస్తక్లేశాలను, పాపాలను పోగొట్టుకొన్నవారు, నీ సేవలోనే మిక్కిలి ఆసక్తులైనవారు, నీకే తగిన, ఎవరి ప్రేరణ లేక స్వయంగా గ్రహించిన ఛత్రచామరాది ఆయా కైంకర్యసాధనాలను కల్గినవారైన నిత్యసూరులచే యథోచితంగా సేవింపబడే నిన్ను సేవించి ఎపుడు సంతోషపెట్టగలను!

**అపూర్వనానారసభావ నిర్భర ప్రబుద్ధయా ముగ్ధవిదగ్ధ లీలయా ।**
**క్షణాణువత్ క్షిప్తపరాదికాలయా ప్రహర్షయన్తం మహిషీం మహాభుజమ్ ॥ 44**

ఎప్పటికప్పుడు కొత్తగా తోచే, అనేకవిధాలైన శృంగారాదిరసాలతో, నిర్వేదాది భావాలతో పూర్తిగా నిండి ఉన్నవి, పరపరార్ధకాలాలనుకూడా క్షణంలోని అణువు వలె అతితక్కువ కాలంగా గడుపదగినవి, సుందరమైనవి, చాతుర్యంతో కూడినవి అయిన శృంగారాదిలీలలతో పట్టపుదేవి అయిన లక్ష్మిని సంతోషపెట్టేవాడవు, గొప్ప భుజాలను కలవాడవైన నిన్ను సేవించి ఎపుడు సంతోషపెట్టగలను?

**అచిన్త్యదివ్యాద్భుత నిత్యయౌవనస్వభావలావణ్యమయామృతోదధిమ్ ।**
**శ్రియ శ్శ్రియం భక్తజనైకజీవితం సమర్థ మాపత్సఖ మర్థికల్పకమ్ ॥ 45**

తెలిసికోవడానికి సాధ్యం కాని, అప్రాకృతమైన, ఆశ్చర్యాన్ని కలిగించే, నిత్యమైన యౌవనమే స్వభావంగా కల్గిన లావణ్యమయమైన అమృతసముద్రంవంటివాడవు, లక్ష్మికే లక్ష్మివంటివాడవు, భక్తజనులనే ప్రాణాలుగా కలవాడవు, సమర్థుడవు, ఆపదలలో మిత్రుడవు, యాచకులకు కల్పవృక్షంవంటివాడవైన నిన్ను సేవించి ఎప్పుడు సంతోషపెట్టగలను?

**భవన్త మేవానుచరన్ నిరన్తరం ప్రశాంతనిశ్శేషమనోరథాన్తరః ।**
**కదాఽహ మైకాంతికనిత్యకింకరః ప్రహర్షయిష్యామి సనాథజీవితః ॥ 46**

చింతించడానికి సాధ్యం కాని అప్రాకృతమైన, అద్భుతమైన, 'నిత్యమైన' యౌవనాన్ని సహజంగా కల్గినదీ, లావణ్యమయమైనది అయిన అమృతసముద్రం వంటివాడవు,లక్ష్మీదేవికి లక్ష్మివంటివాడవు, భక్తులను నీ ప్రాణంగా భావించేవాడవు, సమర్థుడవు, ఆపదలలో మిత్రుడవు, యాచకులకు కల్పవృక్షంవంటివాడవైన నిన్ను సేవించి ఎపుడు సంతోషపెట్టగలను?

**ధిగశుచి మవినీతం నిర్దయం మా మలజ్జం**
**పరమపురుష! యోఽహం యోగివర్యాగ్రగణ్యైః ।**
**విధిశివసనకాద్యైః ధ్యాతు మత్యన్తదూరం**
**తవ పరిజనభావం కామయే కామవృత్తః ॥ 47**



ఓ పరమపురుషా! యోగివర్యులలో అగ్రగణ్యులైన బ్రహ్మ, శివసనకాదులచే కూడ ధ్యానించడానికి ఏమాత్రం సాధ్యం కాని నీ కైంకర్యాన్ని కామచారిని అయిన నేను కోరుతున్నాను. ఇటువంటి అపరిశుద్ధుడను, వినయరహితుడను, దయాహీనుడను, భయం లేనివాడను, సిగ్గు లేనివాడను అయిన నేను, కుక్క పురోడాశాన్ని ఆశించినట్లు, కోరుతున్నాను. ఛీ! ఛీ!

**అపరాధసహస్రభాజనం పతితం భీమభవార్ణవోదరే ।**
**అగతిం శరణాగతం హరే! కృపయా కేవల మాత్మసాత్కురు ॥ 48**

పాపాలను హరించే ఓహరీ! వేలాది అపరాధాలను చేసినవాడను, భయంకరమైన సంసారసముద్రం మధ్యలో పడినవాడను, (నీవు తప్ప) వేఱు ఏ దిక్కు లేనివాడను, (నిన్ను) శరణు పొందినవాడను అయిన నన్ను నీ అవ్యాజకృపతో నీవానినిగా స్వీకరించు.

**అవివేకఘనాన్ధదిఙ్ముఖే బహుధా సన్తతదుఃఖవర్షిణి ।**
**భగవన్! భవదుర్దినే పథఃస్ఖలితం మా మవలోకయాచ్యుత ॥ 49**

భగవన్! అచ్యుతా! అవివేకమనే మేఘాలచేత కప్పబడిన దిక్కుల ముఖాలను కల్గినది, నిత్యం అనేకవిధాలుగా దుఃఖాలనబడే వర్షాన్ని కురిపిస్తున్నదైన సంసారమనే దుర్దినంలో మార్గంనుండి తప్పిపోయిన నన్ను కరుణించు.

**న మృషా పరమార్థమేవ మే శృణు విజ్ఞాపన మేక మగ్రతః ।**
**యది మే న దయిష్యసే తతో దయనీయ స్తవ నాథ! దుర్లభః ॥ 50**

అబద్ధం కానిది, పరమార్థమైనది అయిన నా ఈ ఒక్క విన్నపాన్ని ముందుగా విను. నాథా! నాపట్ల నీవు దయచూపకపోతే తరువాత నీకు దయ చూపదగిన వాడు దొరుకడుసుమా!

**తదహం త్వదృతే న నాథవాన్ మదృతే త్వం దయనీయవాన్నచ ।**
**విధినిర్మిత మేతద న్వయం భగవన్! పాలయ మా స్మ జీహపః ॥ 51**

అందువల్ల! నీవు తప్ప నాకు వేఱే నాథుడు లేడు. నీకుకూడా నేనుతప్ప, నావలె దయ చూపదగినవాడింకొకడు లేడు. భగవన్! ఏదో అదృష్టవశంచేత నిర్మింపబడ్డ (మన) ఈ సంబంధాన్ని (రక్ష్య - రక్షకభావసంబంధాన్ని) నీవు వదలకు. నన్ను రక్షించు.

**వపురాదిషు యోఽపి కోఽపి వా గుణతోఽసాని యథాతథావిధః ।**
**తదయం తవ పాదపద్మయో రహ మద్యైవ మయా సమర్పితః ॥ 52**

ఆత్మ అనేది - శరీరం, ఇంద్రియాలు - మొదలైనవానిలో ఏదో ఒకటి కానీ, గుణంలో ఏదో విధంగా ఉండనీ. విభుత్వం - అణుత్వం, శరీరపరిమాణత్వం, జడత్వం, అజడత్వం, జ్ఞాతృత్వం, కర్తృత్వం, భోక్తృత్వం, శేషత్వం - అనే వీటిలో ఏ గుణాన్ని అయినా ఆత్మ కల్గి ఉండనీ. ఆత్మస్వరూప స్వభావాలనుగూర్చిన చింత మాత్రం నాకు లేదు. నీ పాదపద్మాలలో అహంశబ్దవాచ్యమైన నా ఈ ఆత్మను ఇపుడే నేను సమర్పించాను.

**మమ నాథ! యదస్తి యోఽస్మ్యహం సకలం తద్ధి తవైవ మాధవ! ।**
**నియతస్వమితి ప్రబుద్ధధీః అథవా కిం ను సమర్పయామి తే ॥ 53**

ఓ మాధవా! పరమపదనాథా! నాకు సంబంధించిన, నేను అనబడే ఈ ఆత్మ-అంతా నీకు చెందిన సొత్తేకదా! - అని బాగా తెలిసికొన్న నేను ఇక ఏమి నీకు సమర్పించగలను?

**అవబోధితవానిమాం యథా మయి నిత్యాం భవదీయతాం స్వయమ్ ।**
**కృపయైన మనన్యభోగ్యతాం భగవన్! భక్తిమపి ప్రయచ్ఛ మే ॥ 54**

భగవన్! నా శేషత్వాన్ని మఱచి, "నన్ను నీకు సమర్పించుకొన్నాను" అని పలికే నాలో అన్ని సమయాలలో శాశ్వతంగా ఉండే ఈ శేషత్వాన్ని ఏవిధంగా నీవే గుర్తు చేశావో, ఆ విధంగానే నీపట్ల అనన్యభోగ్యమైన (నీలో తప్ప ఇంకొకరిపట్ల ఆసక్తం కాని) భక్తినికూడా నాకు నీవే ప్రసాదించు.

**తవ దాస్యసుఖైకసంగినాం భవనేష్వస్త్వపి కీటజన్మ మే ।**
**ఇతరావసథేషు మా స్మ భూదపి మే జన్మ చతుర్ముఖాత్మనా ॥ 55**

నీకు దాస్యం చేయడమనే సుఖంలోనే ఆసక్తిని కల భాగవతోత్తముల భవనాలలో నేను చిన్న కీటకంగా పుట్టినా నాకది చాలు. ఇతరుల ఇళ్ళలో బ్రహ్మగా నాకు జన్మ కల్గినా వద్దు.

**సకృత్త్వదాకారవిలోకనాశయా తృణీకృతానుత్తమభుక్తిముక్తిభిః ।**
**మహాత్మభిర్మా మవలోక్యతాం నయ క్షణేఽపి తే యద్విరహోఽతిదుస్సహః 56**



ఒకసారి నీ ఆకారాన్ని దర్శించడంలోని ఆశతో గొప్ప భోగాలను, ముక్తినిసైతం తృణంగా భావించి తిరస్కరించిన ఏ మహాత్ములతో కలిగే విరహం క్షణకాలమైనా నీకు దుస్సహమో, ఆ మహాత్ములు నన్ను కటాక్షించేటట్లుగా నీవు చేయాలి.

**న దేహం న ప్రాణాన్ న చ సుఖ మశేషాభిలషితం**
**న చాత్మానం నాన్యత్ కిమపి తవ శేషత్వవిభవాత్ ।**
**బహిర్భూతం నాథ! క్షణమపి సహే యాతు శతథా**
**వినాశం తత్సత్యం మధుమథన! విజ్ఞాపన మిదమ్ ॥ 57**

మధువనే అసురుని సంహరించిన స్వామీ! నీకైంకర్యమనే వైభవానికి దూరమైన దేహాన్ని క్షణంకూడా సహించలేను. ప్రాణాలనుకూడా క్షణమైనా సహించలేను. అందఱు కోరే సుఖాన్ని సైతం క్షణమైనా సహించలేను. ఆత్మనుకూడా క్షణమైనా సహించలేను. వీటికంటే వేఱయిన పుత్రమిత్రకళత్ర గృహక్షేత్రాదులను సైతం క్షణమైనా సహించలేను. నీ కైంకర్యానికి ఉపయోగపడని పైన పేర్కొన్న దేహాదులన్నీ వేయి విధాలుగా వినాశాన్ని పొందనీ. మధుసూదనా? ఇది నా విన్నపం. నిజం.

**దురన్తస్యానాదే రపరిహరణీయస్య మహతో**
**నిహీనాచారోఽహం నృపశురశుభస్యాస్పదమపి ।**
**దయాసిన్ధో! బన్ధో! నిరవధికవాత్సల్యజలధే!**
**తవ స్మారం స్మారం గుణగణ మితీచ్ఛామి గతభీః ॥ 58**

దయాసముద్రా! సర్వవిధబంధూ! నిరవధికమైన వాత్సల్యానికి సముద్రం వంటివాడా! నిహీనమైన ప్రవర్తనను కలవాడను, పశుప్రాయుడను అయిన నేను ఘోరమైన విపాకాన్ని (పరిణామాన్ని) కల్గినది, అనాది, పరిహరించడానికి సాధ్యం కానిది, గొప్పది అయిన పాపానికి స్థానం అయినా, నీ కల్యాణగుణ సముదాయాన్ని మాటిమాటికి తలచిన కొద్దీ భయం లేనివాడనై, పైన పల్కిన రీతిలో నీ శేషత్వాన్ని కోరుతున్నాను సుమా!

**అనిచ్ఛన్నప్యేవం యది పునరితీచ్ఛన్నివ రజః -**
**తమశ్ఛన్నశ్ఛద్మస్తుతివచనభంగీ మరచయమ్ ।**
**తథాపీత్థం రూపం వచన మవలంబ్యాపి కృపయా**
**త్వమేవైవంభూతం ధరణిధర! మే శిక్షయ మనః ॥ 59**

ఓ ధరణీధరా! ఈ విధంగా నాకు నిజంగా ఇచ్ఛ లేకపోయినా, ఇచ్ఛ ఉన్నవాని వలె నటిస్తూ, రజస్తమోగుణాలతో కూడుకొన్నవాడనై, కపటస్తుతితో కూడిన

వాక్యాలను రచించాను. అయినా, ఈ విధమైన కపటవచనాలను ఆధారంగా చేసికొని అయినా, నీవే ఈ కపటస్తుతికి కారణమైన నా మనస్సును శిక్షించు.

**పితా త్వం మాతా త్వం దయితతనయ స్త్వం ప్రియసుహృత్**
**త్వమేవ త్వం మిత్రం గురురసి గతిశ్చాసి జగతామ్ ।**
**త్వదీయ స్త్వద్భృత్య స్తవ పరిజన స్త్వద్గతి రహం**
**ప్రపన్న శ్చైవం సత్యహమపి తవైవాస్మి హి భరః ॥ 60**

లోకాలకు అన్నిటికి నీవే తండ్రివి, నీవే తల్లివి, నీవే ప్రియపుత్రుడవు, నీవే సుహృత్తువు, నీవే మిత్రం, గురువువు, ఉపాయం, ఉపేయంకూడా నీవే. నేను నీ వాడను, నీ భృత్యుడను, నీ పరిజనుడను, నిన్నే గతిగా కలవాడను. శరణాగతుడను కనుక నా రక్షణభారం నీదే.

**జనిత్వాఽహం వంశే మహతి జగతి ఖ్యాతయశసాం**
**శుచీనాం యుక్తానాం గుణపురుషతత్త్వస్థితివిదామ్ ।**
**నిసర్గాదేవ త్వచ్చరణకమలైకాన్తమనసామ్**
**అధోఽధః పాపాత్మా శరణద! నిమజ్జామి తమసి ॥ 61**

శరణాన్ని ఇచ్చే స్వామీ! ప్రపంచంలో మిక్కిలి కీర్తిని పొందినవారు, పరిశుద్ధులు, నీ విరహాన్ని భరించలేక నిత్యం నీతోకూడి ఉండేవారు, ప్రకృతి-పురుషుల యథార్థ తత్త్వాన్ని స్ఫుటంగా తెలిసినవారు, సహజంగానే నీ శ్రీచరణపద్మాలలో అసక్తమైన మనస్సును కలవారైన మహాత్ముల గొప్ప వంశంలో జన్మించినా, పాపాత్ముడ నయ్యాను. అంధకారంతో నిండిన ప్రకృతిమండలంలో పలు పాపాలను చేస్తూ ఇంకా ఇంకా లోపలకు మునిగిపోతున్నాను.

**అమర్యాదః క్షుద్ర శ్చలమతి రసూయాప్రసవభూః**
**కృతఘ్నో దుర్మానీ స్మరపరవశో వంచనపరః ।**
**నృశంసః పాపిష్ఠః కథ మహ మితో దుఃఖజలధేః**
**అపారాదుత్తీర్ణ స్తవ పరిచరేయం చరణయోః ॥ 62**

శాస్త్రమర్యాదను అతిక్రమించినవాడను, క్షుద్రుడను, చంచలమతిని, అసూయకు పుట్టినిల్లువంటివాడను, కృతఘ్నుడను, దురహంకారాన్ని కలవాడను, మన్మథునకు వశమైనవాడను, మోసాన్ని ప్రధానంగా కలవాడను, క్రూరుడను, పాపిష్ఠుడను అయిన నేను అంతు లేని దుఃఖసముద్రంనుండి ఏవిధంగా దాటి నీ చరణపద్మాలలో పరిచర్యను చేయగలను?



**రఘువర! యదభూస్త్వం తాదృశో వాయసస్య**
**ప్రణత ఇతి దయాళు ర్యచ్చ చైద్యస్య కృష్ణః ।**
**ప్రతిభవ మపరాద్ధు ర్ముగ్ధసాయుజ్యదోఽభూః**
**వద కి మపదఽమాగ స్తస్య తేఽస్తి క్షమాయాః ॥ 63**

శ్రీరామచంద్రా! నీవు అసహ్యమైన అపరాధాన్ని చేసిన కాకాసురునిపట్ల ''అతడు శరణు వేడాడు'' అనే కారణంతో దయచూపావు - అనే మాటను, శ్రీకృష్ణుడవై ప్రతిజన్మలోను అపరాధాలను చేసిన శిశుపాలునకు సాయుజ్యాన్ని ఇచ్చావు - అనే మాటను గమనిస్తే, ఓ ముగ్ధుడా! (పాపవివేచనను, విచక్షణను చేయకుండా శరణాగతులను రక్షించేవాడా!) నీ క్షమాగుణానికి విషయం కాని అపరాధం అనేది ఏమి ఉన్నది? చెప్పు

**నను ప్రపన్న స్సకృదేవ నాథ! తవాఽహమస్మీతి చ యాచమానః ।**
**తవానుకంప్యః స్మరతః ప్రతిజ్ఞాం మదేకవర్జం కిమిదం వ్రతం తే ॥ 64**

సర్వశేషియైనవాడా! నేను నిన్నే శరణు పొందాను, నీ దాసుడను - అని ఒక్కమారే యాచించేవాడనై, **"సకృదేవ ప్రపన్నాయ"** ఇత్యాదిగా నీవు చేసిన ప్రతిజ్ఞను స్మరిస్తున్న నీచే దయ చూపదగినవాడనై ఉన్నాను. నీవు చేపట్టిన శరణాగతరక్షణ వ్రతం నా ఒక్కని విషయంలోమాత్రం అన్వయించదా! ఏమి!

**అకృత్రిమత్వచ్చరణారవిన్ద ప్రేమప్రకర్షావధి మాత్మవన్తమ్ ।**
**పితామహం నాథమునిం విలోక్య ప్రసీద మద్వృత్త మచిన్తయిత్వా ॥ 65**

నీ శ్రీచరణపద్మాలలో సహజమైన గొప్ప భక్తియొక్క పరమావధిని కలవారు, ఆత్మయాథాత్మ్యజ్ఞానాన్ని కలవారు, శ్రీరంగనాథమునులనే నామాన్ని కలవారు అయిన నా పితామహులను చూచి, నా నడవడికను లెక్కించకుండా నన్ను అనుగ్రహించు.

---

**యత్పదాంభోరుహధ్యాన విధ్వస్తాశేషకల్మషః ।**
**వస్తుతా ముపయాతోఽహం యామునేయం నమామి తమ్ ॥**

ఏయామునుల పాదపద్మాల ధ్యానంవల్ల పాపాలను అన్నిటిని పోగొట్టుకొనిన నేను సత్తను పొందానో, ఆ యామునులకు నమస్కరిస్తున్నాను.

స్తోత్రరత్న తాత్పర్యం సంపూర్ణం